డోంట్ రైజ్ హైట్." అన్నాడు ఆర్/టి లో. మిగ్ విమానాలు ముందుకు వెళ్ళిపోయాయి.

పడమటి వైపు నుండి వస్తున్న పాక్ మిరేజ్ విమానాలు నాలుగూ రెండు జట్లుగా విడిపోయాయి, ఒక జట్టు మిగ్‌లవైపు, మరోజట్టు నాట్‌లవైపు తిరిగాయి.

టైగర్ వన్ నాట్ పైలట్ ప్రమాదాన్ని గ్రహించాడు. ఫ్రాన్స్‌లో తయారయిన మిరేజ్ విమానాలు అతి వేగమైన, శక్తివంతమైన విమానాలు. వాటిలో వుందే ఎయిర్-టు-ఎయిర్ మిసైల్సు చాలా ప్రమాదకరమైనవి. రెండు మిరేజ్‌లు మిగ్స్‌ను కూల్చడానికి ప్రయత్నిస్తే, మరో రెండు ఎస్కార్టు వచ్చిన నాట్‌లతో తలపడి మిగ్-21 లకు రక్షణ లేకుండా చేస్తాయన్నమాట.

"టైగర్ టు-మన వైపు వచ్చే మిరేజెస్‌ను నువ్వు కాచుకో. మిగ్‌లవైపు వెళ్ళే వాటిపని నేను పడతాను" అన్నాడు టైగర్ వన్ నాట్‌లోని రంజిత్ సింగ్. విమానాన్ని హఠాత్తుగా ఇరవై అడుగుల ఎత్తుకు దించి ఎదురుగా వస్తోన్న మిరేజ్ మిషన్‌గన్ గుళ్ళు తప్పించుకొని మిగ్-21ల వెంటపడ్డ మిరేజ్ విమానాలవైపుకు దూసుకుపోతూ.

మిగ్-21లు ఫైటర్ జట్స్ అయినా వాటి రెక్కలకు బెల్లీనిండా వున్న బాంబులు రాకెట్ల బరువువలన సులభంగా దిశలు మార్చే శక్తి తగ్గుతుంది. అంచేతే మిరేజ్‌లను చూడగానే బాగా క్రిందికి ఎగరమని మిగ్-21 లను హెచ్చరించాడు నాట్ పైలట్. ఆ ఎత్తులో పాక్ మిరేజ్‌లు వదిలే ఎయిర్-టు-ఎయిర్ మిసైల్సుకు ఉధృతంగా పనిచేసే శక్తి పోతుంది.

టైగర్ టు నాట్ విమానంలో వున్న పైలట్ మనోజ్ తనను రెండువైపులనుండి పట్టేయాలని కుడి ఎడమల నుండి వస్తోన్న మిరేజ్ లను చూడగానే, కంట్రోల్ స్టిక్ ను బాగా క్రిందికి వత్తుతూ, చటుక్కున వంద అడుగులు క్రిందకు దిగాడు.

నాట్ జట్ ఫైటర్ లో వున్న అద్భుతం_అదే. కంట్రోల్స్ కు బ్యూటిఫుల్ గా రెస్పాండ్ అవుతుంది. ఎటు త్రిప్పితే అటు సులభంగా తిరుగుతుంది. క్షణాల్లో గాలిలో పల్టీలు కొడుతుంది. ఎంత తక్కువ ఎత్తుకైనా చటుక్కున దిగుతుంది. ఎంత ఎత్తుకైనా క్షణాల్లో ప్రాకిపోతుంది_ఫుల్ ఆక్సిలరేషన్ లో నిముషానికి ఇరవైమూడు వేల అడుగులు ఆకాశంలోకి ఎగబ్రాకుతుంది. అంత చిన్న జెట్ లో అంతటి శక్తి వుంది.

తన జెట్ లో వున్న శక్తిని, యుక్తుల్ని ఎలా వుపయోగించుకోవాలో మనోజ్ కు బాగా తెలుసు. రెండుప్రక్కల్నుండి ట్వల్వ్ యమ్.యమ్. బుల్లెట్లు కాలుస్తూ తనమీదికి వచ్చే మిరేజ్ ల మధ్య నుండి ఎత్తుకు ఎగరడం అవివేకం అని తెలుసు.

కత్తెరలా వస్తోన్న క్రాస్ ఫైర్ మధ్య తన విమానం క్షణాల్లో కూలిపోతుంది. అంచేతే మిరేజ్ లనుండి తప్పించుకోడానికి భూమికి ఇరవై అడుగుల ఎత్తుకు దిగాడు. నాట్ కన్న దాదాపు మూడురెట్ల పరిమాణం వున్న మిరేజ్ లు అంత క్రిందికి రాలేవు. వస్తే నాట్ తో పాటు చురుగ్గా ఆకాశంలోకి ఎగబ్రాకే శక్తి దానికి లేదు.

క్రిందికి దిగుతూనే గుండ్రంగా తిరిగి ఓ పల్టీకొట్టే ఫుల్ యాక్సిలరేషన్ లో నాట్ ను పైకి లేపాడు. క్రిందనుండి

క్షణాల్లో రాకెట్లా రయ్యిన ఆకాశంలోకి దూసుకు వెళ్ళింది. తమ మధ్యనుండి తప్పించుకొని క్రిందకు జారిన నాట్ పై తిరిగి దాడిచేసి వుద్దేశ్యంతో మిరేజ్ లు టైట్ సర్కిల్ లో వెనక్కు తిరుగుతోన్నయ్.

సర్రున ఆకాశంలోకి లేస్తున్న మనోజ్ ను వెనక్కి తిరుగుతున్న ఓ మిరేజ్ అడుగుభాగం అద్భుతమైన టార్గెట్ లా కనిపించింది. ఒక్కక్షణం పైకి లేస్తున్న విమానాన్ని గాలిలో అలానే ఆపి తన ముఫై. యం.యం. ఆడెన్ కానన్ ను చకచకా పేల్చాడు. నాట్ లోని ఫిరంగి గుళ్ళు మిరేజ్ విమానం అడుగుభాగాన్ని చిల్లులు పొడిచింది. మిరేజ్ పెట్రోలు టాంకులు భగున మండి క్షణాల్లో మండే అగ్నిగోళంలా ఆ మిరేజ్ కంట్రోలు తప్పి భూమ్మీదకు జారిపోవడం మొదలెట్టింది.

మిరేజ్ ను షూట్ చేయడంకోసం క్షణం ఆగిన నాట్ ను చూడగానే రెండో మిరేజ్ పైలట్ ఆలశ్యం చెయ్యలేదు. వింగ్ సైట్ సరిచేసి తిన్నగా నాట్ మీదనే ఓ ఎయిర్ టు ఎయిర్ మిసైల్ వదిలాడు.

మిసైల్ తగిలే సమయానికి నాట్ ఆ ప్రదేశం నుండి కదిలిపోయినా ఫరవాలేదు. ఆ మిసైల్ ఊహించలేని వేగంతో ఎదటి విమానం ఏవైపు తిరిగితే ఆ వైపుకు వెంటబడి కూల్చేస్తుంది. ఎయిర్ టు ఎయిర్ మిసైల్స్ లో అద్భుతం అదే.

ఓ మిరేజ్ ని కూల్చి పైకి లేస్తున్న మనోజ్ తనకు రాబోయే ప్రమాదాన్ని క్షణాల్లో గ్రహించాడు. ఎయిర్ టు ఎయిర్ మిసైల్స్ హాట్ సీకర్స్. అంటే జట్ విమానాలు ఎగిరేటప్పుడు ఎక్స్ టింగ్ విషర్స్ ద్వారా వదిలే

పొగలో వుండే వేడిని బట్టి అవి, ఆ జట్ ఎటు తిరిగితే అటు తిరిగి వెంటబడి జట్ కన్నా రెట్టింపు వేగంతో వెళ్ళి జట్ ను కూల్చేస్తాయి.

వెంటనే స్పీడ్ కట్ చేసి మళ్ళీ చటుక్కున నేలవైపు విమానాన్ని దింపడం ప్రారంభించాడు. భూమికి ఏభై అడుగుల ఎత్తులో ఎయిర్ టు ఎయిర్ మిస్సైలు శక్తిహీన మవుతుందని మరిచిపోలేదు.

రయ్యిన విమానాన్ని నలభై అడుగులకు దించి, గుర్రున లెఫ్ట్ బాంక్ టర్న్ చేసి, మళ్ళీ చటుక్కున పైకి లేపాడు. భూమికి దగ్గరగా వచ్చిన మిస్సైల్ దారితప్పి భూమి ఆకర్షణశక్తివల్ల నేలవైపు దూసుకుపోయింది.

మనోజ్ నాట్ మిస్సైల్ నుండి తప్పించుకోడానికి క్రిందకు దిగడం చూడగానే మనసులోనే నవ్వుకొన్నాడు మిరేజ్ లోని పాకిస్తాన్ పైలట్. నలభై అడుగుల ఎత్తుకు వెళ్ళి మళ్ళీ చటుక్కున మనోజ్ జట్ పైకి వస్తుందని తెలుసు. అందుకే మనోజ్ నాట్ పైకి వచ్చేప్పటికి సిద్ధంగా కాచుకొని వున్నాడతను.

పైకి లేస్తోన్న నాట్ ముందుభాగమంతా మిరేజ్ వదిలిన మిషన్ గన్ గుళ్ళకు తూట్లుపడింది. పైలట్ సీటు పైభాగంలో వుండే అద్దం పగిలి ముక్కలయింది. ఇంజన్లోంచి తెల్లని పొగ క్షణాల్లో కాబిన్ నింపేసింది.

మనోజ్ నాట్ ను గాలిలోనే ఆపి చిన్న పల్టీ కొట్టించి మిరేజ్ కు ఎదురుగా తిప్పాడు. తన గురి తప్పలేదని గ్రహించిన మిరేజ్ పైలట్ మిషన్ గన్ ప్రేలుస్తూ నాట్ వైపు దూసుకువచ్చాడు.

మనోజ్ చకచకా గన్ ఫైట్ మిరేజ్ కు అడస్ జట చేశాడు. కాబిన్ గ్లాస్ రూఫ్ పగిలిపోవడంవలన గాలికి

పొగంతా బయటికి పోయింది. మిరేజ్ తనకు తిన్నగా రాగానే తన థర్టీ యమ్.యమ్. ఆడన్ కానన్ ట్రిగర్ నొక్కాడు. క్షణం ఆశ్చర్యపోయాడు మనోజ్. కానన్ పనిచేయడంలేదు. బహుశా గన్ కనక్షన్ తెగిపోయి వుండాలి.

సరిగ్గా అదే సమయంలో ఇంజన్లోంచి పెద్ద పెద్ద మంటలు, నల్లటి పొగ బయటికి రావడం మొదలెట్టినయ్. విమానం క్షణక్షణానికి కంట్రోలు తప్పుతోంది. సీట్ ఏజెక్యులేటర్ స్విచ్ గట్టిగా నొక్కాడు. ఫలితం లేదు. తను ఈ కూలి పోయే విమానంలోనుండి బయటపడే అవకాశంలేదు. బలవంతంగా కంట్రోలు స్టిక్ పట్టుకొని విమానం క్రిందికి జారకుండా ఆపాడు.

మిరేజ్ పైలట్ విజయగర్వంతో పొగలు కక్కుతోన్న నాట్ కు మరింత దగ్గరయ్యాడు. అదే అతను చేసిన పొరపాటు. మనోజ్ కంట్రోల్ స్టిక్ ను గట్టిగా పట్టుకొని నాట్ ను తిన్నగా ఎదురొస్తున్న మిరేజ్ వైపే నడిపాడు. చివరి క్షణంలో మిరేజ్ పైలట్ కు మనోజ్ ఉద్దేశ్యం అర్థమయింది. చటుక్కున మిరేజ్ ను పైకి లేపాడు. కాని అప్పటికే ఆలస్యం అయింది. పొగలు కక్కుతూ మండుతోన్న టైగర్ టూ నాట్ తిన్నగా మిరేజ్ ను ఢీకొంది.

ఆకాశంలో గొప్ప ప్రేలుడు. మరుక్షణం ఒకదాన్తో ఒకటి కలిసిపోయిన మిరేజ్, నాట్ లు రెండూ భగభగ మండుతూ భూమివైపు జారిపోవడం మొదలెట్టాయి.

సిల్వర్ ఫార్మేషన్ మరో నిముషంలో పినేరా రైల్వే మార్షలింగ్ యార్డ్ చేరుకొంటుంది. ఈలోగా

సిల్వర్ మిగ్స్‌ను వెంటాడుతున్న మిరేజ్‌లు వాటిని కూల్చకుండా ఆపడమే టైగర్ వన్ నాట్‌లో రంజిత్ సింగ్ లక్ష్యం.

ఎందుకంటే సిల్వర్ ఫార్మేషన్ రైల్వే యార్డ్ చేరగానే చకచకా బాంబింగ్ పూర్తిచేసి తన సహాయానికి వస్తాయని తెలుసు. ఎందుకంటే సిల్వర్ మిగ్స్ ఏదో ఒక ప్రత్యేక టార్గెట్ బాంబ్ చేసే పనిమీద రాలేదు. మార్షలింగ్ యార్డ్ కార్పెట్ బాంబింగ్ చెయ్యడానికి వచ్చాయి.

కార్పెట్ బాంబింగ్ అంటే, శత్రువుకు పనికొచ్చే ప్రతి వస్తువుమీదా విచక్షణారహితంగా వరుసగా చాప పరిచినట్లు బాంబులు వదులుకొంటూ పోవడమే. అందుచేత సిల్వర్ ఫార్మేషన్‌లో వుండే మిగ్ జాగ్రత్తగా ఒక్కో బాంబే జారవిడవాలన్న నియమం ఏమీలేదు. రైల్వే యార్డులోని రైలు బద్దీలు, యార్డులో వున్న గూడ్సు రైళ్లు, గొడౌన్లు, పెట్రోలు డంప్‌లు, అన్నిటిమీదా వరుసగా బాంబులు వేసుకొంటూ పోతారు.

స్పీడు పెంచి తన నాట్‌ని మిరేజ్‌లవైపు ఉరికించాడు రంజిత్ సింగ్.

మిరేజ్‌లు మాత్రం ట్రీటాప్ లెవల్లో ఎగురుతోన్న మిగ్‌లంత క్రిందికి ఎగిరి షూట్ చేయడం కష్టం కనుక వాటి ప్రక్కల, పైనా అదనుకోసం కాచుకొని తరుముతున్నాయి. పైగా మిరేజ్‌లకు మిగ్‌లతో మరో సమస్య వుంది. మిరేజ్‌లు గంటకు దాదాపు పదిహేనువందల మైళ్ళ వేగంతో పోతాయి. వాటితో పోలిస్తే మెల్లగా వెళ్ళే మిగ్‌లతో సరయిన స్పీడు మెయిన్‌టైన్ చెయ్యడం

మిరేజ్ పైలట్లకు కష్టమవుతుంది. మిరేజ్‌లలో వుండే ఈ డిఫెక్ట్ తెలిసిన మిగ్ పైలట్లు సాధ్యమైనంత తక్కువ వేగంతో మిగ్‌లు నడుపుతున్నారు.

ఆలస్యం చెయ్యకుండా మిగ్‌లతో సమానమైన ఎత్తులో వేగంగా తన నాట్ విమానాన్ని ముందుకు దూకించాడు రంజిత్. క్షణాల్లో మిరేజ్‌ల క్రిందకు తీసుకు వచ్చాడు తన నాట్‌ని.

తమ క్రిందకే వచ్చిన నాట్‌ను చూడగానే గబగబా తమ మిరేజ్‌లను ఎత్తుకు లేపసాగారు మిరేజ్ పైలట్లు. రంజిత్ సందేహించలేదు. నాట్‌ని పల్టీకొట్టించి, బొంగరంలా గిర్రున తిప్పుతూ నిటారుగా పైకి లేపాడు.

వేగంగా పైపైకి పోతున్న మిరేజ్ తోకభాగం స్పష్టంగా కనిపించింది. దాదాపు ఆరొందల గజాల దూరంలో వుంది. గన్ ఫైట్ క్షణంలో అడ్జస్ట్ చేసి చకచక తన కానన్ పేల్చాడు. గురి తప్పలేదు. ఎదురుగా వున్న మిరేజ్ తోకలోనుండి మరుక్షణం నల్లటి పొగ రాసాగింది. మిరేజ్ బట్స్ వెనకవైపు 'ఆప్టర్ బర్నర్స్' క్రిందుగా ఎక్స్‌ట్రా ఫ్యూయల్ టాంక్స్ వుంటాయి. బహుశా అవి పగిలి, ఆప్టర్ బర్నర్ వేడికి అంటుకొని వుంటాయి. ఆ విమానం ఇక ఎంతోసేపు ఆకాశంలో ఎగరదు.

గిర్రున గడియారం ముల్లులా ఆకాశంలో ఓసారి తిరిగి రెండో మిరేజ్ కోసం చూశాడు. నవ్వాగలేదు రంజిత్‌కు. క్షణక్షణానికీ వేగం పెంచుకొంటూ దూరంగా వెళ్ళి పోతోంది ఆ రెండో మిరేజ్.

'పారిపోతున్నాడు బాస్టర్ట్.' అనుకొన్నాడు గట్టిగా నవ్వుకొంటూ.

రంజిత్ ముఖంమీద నవ్వు క్షణంలో జారిపోయింది. ఏదో బలమైన హస్తం పట్టుకొని ఊపినట్లు నాట్ అటూ ఇటూ ఊగుతోంది. అప్పుడు తెలిసింది రంజిత్‌కు తన పొరపాటు. తోక అంటుకొని మండిపోతోన్న ఆ మిరేజ్ పైలట్ ఎలాగో కంట్రోల్ చేసుకొని తన మీదకు ఎయిర్-టు-ఎయిర్ మిస్సైల్ ప్రయోగించాడని. ప్రయోజనం లేదని తెలుసు; ఇంకా మిగ్‌ని రక్షించాలని ప్రయత్నించడంవలన ఏ క్షణాన్నయినా మిగ్ ప్రేలిపోవచ్చు.

సీట్ ఎజెక్ట్యలేటర్ బటన్ బలంగా నొక్కాడు. చటుక్కున తను కూర్చున్న సీటుతోసహా స్ప్రింగ్‌లా విమానంలోనుండి ఆకాశంలోకి విసిరేయబడ్డాడు. మరుక్షణం మిగ్-21 పెద్ద శబ్దంతో ఆకాశంలో తునాతునకలయింది.

ఎజెక్ట్యలేటర్ సాయంతో బయటపడిన రంజిత్‌సింగ్ తన పారాచూట్‌ను రిలీజ్ చేశాడు. మెలిమెల్లిగా గాలిలో తేలుతూ క్రిందకు దిగసాగాడు.

# 6

ఉదయం: ఆరు పదిహేను.

"ఫార్మేషన్ గోల్డ్."

ఫార్మేషన్ గోల్డ్‌లోని నాలుగు మిగ్-21 జెట్ బాంబర్లు, ఎస్కార్ట్స్‌గా వెళుతున్న టైగర్ త్రీ అండ్ ఫోర్ నాట్ జెట్ ఫైటర్స్, స్క్వాడ్రన్ లీడర్ బిస్వాస్ నాయకత్వంలో పాకిస్తాన్ రాడార్లకు అందకుండా ట్రీటాప్ లెవెల్లో పాకిస్తాన్ భూభాగంలో చొచ్చుకుపోసాగాయి.

క్షణక్షణానికీ విలువైన కాలం వృధా అయిపోతుందని తెలుసు బిస్వాస్‌కి. అంబాలా బేస్ వదిలి అప్పటికే

ముప్పావుగంట దాటింది. అప్పటినుండి పాకిస్తాన్ ఫార్వర్డ్ ట్రూప్స్‌కి సప్లయిస్ తీసుకువెళ్ళే ఆ ట్రైన్ కోసం చికెన్స్ నెక్ ప్రాంతంనుండి సియాల్‌కోట్ వరకూ అల్లిబిల్లిగా అల్లుకుపోయిన రైలుమార్గాలన్నీ తీక్ష్ణంగా వెతికారు. అదృష్టం కలిసిరాలేదు. మరో పావుగంటలో ఆ ట్రైను ఎటు వస్తుందో కనుక్కోలేకపోతే తమ ప్రయత్నం విఫలమయినట్లే. ఎందుకంటే ఆ తర్వాత ఇంకా వెతుకుతూ వుంటే బేస్‌కు తిరిగి వెళ్ళడానికి జెట్స్‌లో మిగిలే పెట్రోలు సరిపోదు.

అప్పుడు గుర్తొచ్చింది బిస్వాస్‌కు. సియాల్‌కోట్ నుండి చికెన్స్ నెక్ వైపు వెళ్ళే రైలుమార్గం ఓటి. ఆ రైలు మార్గాన్ని చాలా కాలంనుండి వాడడం మానేయడం వలన ఏ మేప్‌లోనూ గుర్తించలేదు. ఆ రైలు మార్గం గురించి గత యుద్ధంలో పాల్గొన్న తన సీనియర్స్ క్లబ్‌లో మాట్లాడుతుండగా విన్నాడు ఓసారి.

చికెన్స్ నెక్‌లో కాశ్మీరు బోర్డరుకు దగ్గరగా వెళుతుంది ఆ రైలు మార్గం. ఆఖరి ప్రయత్నంగా ఆ రైలు మార్గాన్ని వెతకాలని నిశ్చయించుకొన్నాడు బిస్వాస్. వెంటనే విమానాన్ని ఆ వైపు తిరగమని హెచ్చరించాడు.

ఆరు ఇరవై అయిదుకు మేప్‌లో గుర్తింపబడని ఆ రైలు మార్గం బిస్వాస్ కంటబడింది. ఆ రైలు మార్గం వెంటే నిముషానికి ఎనిమిది మైళ్ళ వేగంతో జెట్‌ను పోనివ్వసాగాడు. కనుచూపుమేర దూరంలో ఎక్కడా రైలనేది లేదు.

ఆరున్నరయింది. ఇక బేస్‌కు తిరగమని ఆర్/టిలో చెప్పబోయి ఆగిపోయాడు బిస్వాస్. దూరాన నల్లని రైలు

పొగ కనిపిస్తోంది. క్షణాల్లో దాదాపు ఏభై వాగన్ల పొడ
వున్న రైలు బిస్వాస్ కళ్ళబడింది.

"ఫార్మేషన్ గోల్డ్...టార్గెట్ ఎహెడ్...ఎక్‌నా లెడ్జ్." అన్నాడు ఇంటర్ కమ్‌లో ఉత్సాహంగా.

మిగిలిన పైలట్లందరూ ఒకరి తర్వాత ఒకరు రైలును చూసినట్లు రిప్లయ్ ఇచ్చారు.

"ఓ.కె. లాడ్స్. క్లయింబ్ టు థవుజండ్. రైలు దాటి ముందుకు వెళ్ళండి. ముందువైపునుండి ఎటాక్ చేద్దాము." అన్నాడు బిస్వాస్.

మిగ్‌లన్నీ చకచకా ఎత్తుకు ఎగబ్రాకడం మొదలెట్టినయ్.

"టైగర్స్ డైవ్ లో అండ్ స్కాట్" రెండు నాట్‌లకూ ఇన్‌స్ట్రిక్షన్స్ ఇచ్చాడు బిస్వాస్.

మిగ్‌లు నాలుగూ ఎత్తుకెళ్ళి రైలుమీద దాడికి సిద్ధపడే సమయంలో నాట్‌లో పైలట్లు ఇద్దరూ క్రిందగా ఎగురుతూ తమకు కావలసిన ట్రైను అదో కాదోనని గుర్తిస్తారు. అదే సమయంలో ట్రైనుమీద ఎక్కడయినా యాంటి ఎయిర్‌క్రాఫ్ట్ గన్లు వున్నయ్యేమో గుర్తించి బాంబింగ్ టీమును హెచ్చరిస్తారు.

టైగర్ త్రీ అతి వేగంతో రైలు వాగన్లను తగులుతున్నట్లు ఎగురుతూ వెళ్ళిన విమానం శబ్దం వింటూనే అసంకల్పితంగానే డ్రైవరు కూత వేశాడు.

టైగర్ ఫోర్ పల్టీలు కొడుతూ పక్షిలా నాట్‌ను ఓసారి ట్రైనుమీదకు దింపి పైకెగిరాడు.

"మై గాడ్! ఫుల్ ఆఫ్ యాంటీస్." అన్నాడు టైగర్ ఫోర్ పైలట్ రాంజీ.

"అవును. ప్రతి వాగన్‌మీదా ఓ యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్ వున్నట్టుంది" అన్నాడు టైగర్ త్రీ వినయ్ విమానాన్ని ఇంకా ఎత్తుకి తీసుకెళుతూ.

విజయ్ మాటలకు సమాధానంలా దాదాపు ఓ పది యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ ఆకాశంలోకి షెల్స్ వదలడం ప్రారంభించినయ్.

"ఫార్మేషన్ గోల్డ్... టైగర్ త్రీ రిపోర్టింగ్... మోర్ దెన్ ట్వెంటీ యాంటీస్. కేర్‌ఫుల్ అండ్ గుడ్ లక్." అన్నాడు వినయ్ బిస్వాన్‌కు రిపోర్టు చేస్తూ.

రైలుమీదే రెండువేల అడుగుల ఎత్తున ఆరు విమానాలు గుండ్రంగా తిరుగుతున్నాయి. ఆ ఎత్తులో యాంటి ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్‌వల్ల భయమేమీ లేదు. కాని క్రిందకు దిగి వేగంగా కదిలే ఆ రైలుమీద దాదాపు ఇరవై ఎ.ఎ.సి. గన్లు షెల్స్ వెదజల్లుతోంటే బాంబింగ్ చెయ్యాలని ప్రయత్నించడం అవివేకం.

"లెటజ్ మేక్ బీహైవ్ డ్రాప్." అన్నాడు బిస్వాస్ ఓ నిర్ణయానికొచ్చి.

బీహైవ్ డ్రాప్ అంటే, బాంబ్ చేయదలచుకొన్న వస్తువుమీద చాలా ఎత్తునుండి రెండు విమానాలు కలిసి ఒకే వరసలా బాంబుల్ని జారవిడవడం.

రెండు మిగ్‌లు ఎ.ఎ.సి. గన్లకు అందని ఎత్తులోనుండి బీహైవ్ డ్రాప్ చేశాయి. నాలుగు వందల కిలోల బాంబులు ఈలధ్వని చేసుకొంటూ క్రిందకు జారాయి. తన విమానంలోనుండి ఆతృతగా చూస్తున్నాడు బిస్వాస్.

నాలుగు బాంబులూ రైలుపట్టాలకు చాలా దూరంగా, దాదాపు వంద గజాల దూరంలో నేలను తాకాయి. నాలుగుచోట్ల దుమ్ము కెరటంలా పైకి లేచింది.

"నో యూజ్. క్రిందికి వెళ్ళి ప్రయత్నించాల్సిందే. రైలు ట్రాక్‌ని ముందుకు వెళ్ళి బాంబ్ చేసినా ప్రయోజనం లేదు. బోర్డర్‌కు చాలా దగ్గరగా వచ్చేసింది రైలు. ఇక్కడ ఆగిపోయినా వాళ్ళకేమీ నష్టంలేదు. కాకపోతే ఓ అరగంట లేటవుతాయి సప్లయిలు. రైలును ధ్వంసం చెయ్యడం తప్ప మరో మార్గం లేదు" అన్నాడు బిస్వాస్.

"షల్ ఐ గో లీడర్." అడిగాడు గోల్డ్ టు పైలట్.

"నో. థాంక్యూ. ఐ విల్ గో ఫస్ట్. యూ ఫాలో మీ." అన్నాడు బిస్వాస్ విమానాన్ని క్రిందకు బాంబ్ చెయ్యడానికి రడీగా దింపుతూ.

స్క్వాడ్రన్ కమాండర్ తను వెనక్కి వుండి తన జూనియర్స్‌ని ప్రమాదంలోకి ముందు పంపడం మంచి నాయకుడి లక్షణం కాదు. అందుకే ముందు బిస్వాస్ తన విమానాన్ని పోనిచ్చాడు.

"మొదట రాకెట్లు రిలీజ్ చేసి ట్రైను ముందున్న మార్గం ధ్వంసం చెయ్యండి. అప్పుడు ట్రైనును బాంబ్ చెయ్యడం తేలికవుతుంది." అన్నాడు బిస్వాస్.

మిగ్‌లు క్రిందికి వచ్చేకొలదీ వానజల్లులా యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ షెల్స్ కాలుస్తున్నారు క్రిందనుండి. వంద అడుగుల ఎత్తుకు రాగానే రైలుకు సమాంతరంగా తిప్పాడు విమానాన్ని బిస్వాస్. కంట్రోలు స్టిక్‌ను ఓ చేత్తో వెనక్కి నెట్టిపట్టి, రెండవ చేత్తో రాకెట్ లాంచరు బైను లాగాడు. మిగ్-21 రెక్కల క్రింద అమర్చిన పన్నెండంగుళాల రాకెట్లు రెండు శరవేగంతో ట్రైనుమీదకు దూకాయి...

వదిలిన నాలుగు రాకెట్లలో ఒక్కటే వాగన్ మీద పడింది మిగిలిన మూడూ ప్రక్కలకుపడి ప్రేలిపోయాయి. ఒక యాంటీక్రాఫ్ట్ బుల్లెట్ కాబిన్ నేలలోంచి పైకొచ్చి బిస్వాస్ తొడలోంచి బయటికొచ్చి కప్పులోనుండి వెళ్ళి పోయింది. ఓవరాల్ క్రింద రక్తం జివ్వున చిమ్మింది. పళ్ళు బిగువున విమానాన్ని పైకి లేపి దూరంగా తీసుకెళ్ళాడు.

గోల్డ్ టు పరిస్థితి మరీ ఘోరంగా తయారయింది. రాకెట్ వదలడానికి ట్రైనును అప్రోచ్ అవుతుండగానే పాక్ బుల్లెట్‌లు మిగ్-21ను తూట్లు పొడిచాయి పెట్రోలు టాంకులు అంటుకొని ఆకాశంలోనే భగ్గున మండి పేలిపోయింది.

బిస్వాస్ ముఖం బాధతోనూ, కోపంతోనూ బిగుసుకొంది. "ఫార్మేషన్ స్టాప్ స్ట్రైక్. పులవ్." అరిచాడు ఆర్/టి. లో.

వానజల్లులా కురుస్తోన్న ఆ బుల్లెటమధ్య నుండి క్రింద కెళ్ళి బాంబ్ చెయ్యడం బుద్ధిహీనత. తన మొండితనం వలన, తప్పునిర్ణయం వలన ఇప్పటికే ఓ ప్రాణం పోయింది. అందుకే గోల్డ్ త్రీ, ఫోర్‌లను బాంబ్ చెయ్యకుండా పైకి పిల్చాడు.

"లీడర్! గివజ్ ఎ చాన్స్. బాంబుల బరువు లేకుండా మేము సులువుగా ఆ బుల్లెట్ల మధ్య తిరగ్గలము" అన్నాడు నాట్‌లోవున్న విజయ్.

"ఒ.కె. టైగర్ త్రీ! బి కేర్‌ఫుల్"—అన్నాడు బిస్వాస్ నిస్సహాయంగా.

విజయ్ తన నాట్‌ని పూర్తి యాక్సిలరేషన్‌లో పది వేల అడుగుల ఎత్తుకు తీసుకెళ్ళాడు. అక్కడినుంచి

పారెలల్ డ్రాప్‌లో అతివేగంగా క్రిందకు జారాడు. ఆకాశంలోనుండి తిన్నగా అతివేగంగా వచ్చే నాట్‌ను గురిచూడ్డం కష్టం.

పైనించి క్రిందకు దిగుతునే తన ఫట్రి యమ్. యమ్. కానన్‌ను చకచకా పేల్చాడు. ఇంకా రైలు ముప్పై అడుగుల్లో వుందనగా రైట్ బాంకు త్రిప్పి మళ్ళీ వేగంగా ఫుల్ యాక్సిలరేషన్‌లో పైకి వెళ్ళిపోయాడు.

రెండు యాంటీఎయిర్‌క్రాఫ్ట్ గన్లు, వాటిని పేల్చే సైనికులు ముక్కలయి ట్రైను మీదనుండి క్రిందకు పడ్డారు.

"వెల్‌డన్. టైగర్ త్రీ!"_అరిచాడు బిస్వాస్ ఉత్సాహంగా.

టైగర్ ఫోర్ నాట్‌లోని రాంజీ కూడా విజయ్‌లానే ఎత్తుకువెళ్ళి సర్రున క్రిందికి జారాడు కానన్ పేలుస్తూ. కాని ఈసారి పాక్ సైనికులు సిద్ధంగా వున్నారు. యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ బుల్లెట్‌లు క్రిందకు దిగి పైకి లేవబోతున్న నాట్‌నిండా జల్లెడలా చిల్లులు పొడిచాయి.

"టైగర్ ఫోర్... పులప్... పులప్" అరుస్తున్నాడు బిస్వాస్.

"రాంజీ.యూ. డామిట్. పులప్"__అరుస్తోన్నాడు విజయ్.

కాని రాంజీ వీరెవరి మాటలు వినే స్థితిలో లేదు. బుల్లెట్ ఒకటి అతని పొట్టలో నుండి దూసుకుపోయి, రక్తం వరదలుగా కారసాగింది. ఇంజన్ అంటుకొని భగ భగ మండుతోంది. జెట్ రెండు రెక్కలూ చిల్లులు పడి

తడికెలా తయారయి క్షణక్షణానికీ కంట్రోలు తగ్గి పోతుంది.

“గుడ్ బై ఫ్రండ్స్!”_అరిచాడు రాంజీ బాధగా తన నాట్ ను ట్రైనువైపు ఉరికిస్తూ.

“రాంజీ. పులప్.”—అరుస్తోన్నాడు బిసాస్వ.

టైగర్ ఫోర్ నాట్ విమానం రాలిన ఆకులా వణుకుతూ ట్రైను వైపుకు కదిలింది. మరిన్ని యాంటిక్రాఫ్ట్ బుల్లెట్లు ఇంజన్లో దిగాయి. రాంజీ కళ్లు మూసుకొని ఓ సారి ఇష్టదైవాన్ని తలుచుకొన్నాడు. “భారత మాతాకీ జై” అంటూ అరిచాడు. నాట్ విమానం పల్టీలుకొడుతూ ట్రయినుమధ్యలో వున్న పెట్రోలు టాంకర్ల మీద కూలింది.

భగ్గున మంటలు ఆకాశం ఎత్తు లేచాయి. పెద్దపెద్ద శబ్దాలో, మంటలలో, నల్లని పొగల్లో, దాని ప్రక్కన వున్న టాంకర్లు అంటుకొన్నాయి. ట్రైనుపట్టాలు తప్పింది. ట్రైను పైన యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్స్ దగ్గరవున్న సైనికులు సర్రున క్రిందకు జారారు. కొందరు బాలన్సు తప్పి కూలబడ్డారు.

“గాడ్ బ్లెస్ హిమ్. లెటజ్ బ్లాస్ట్.” అన్నాడు బిస్వాస్ విమానాన్ని కిందికి దూకిస్తూ.

మరుక్షణం నాలుగు మిగ్ లు సప్లయి ట్రయిన్ మీద బాంబులవర్షం కురిపించాయి. నిముషాలమీద సప్లయి ట్రైను మండుతున్న ఇనుపముక్కల కొలిమి అయింది.

బాంబింగ్ పూర్తిచేసి విజయగర్వంతో పైకి లేచాయి భారత మిగ్_21 విమానాలు. ఈ సప్లయ్ ట్రైను లేకుండా పాకిస్తానీయులు యుద్ధం చెయ్యలేరని తెలుసు. అంటే

భారత సేనలకు మరోసారి విజయం తథ్యం అనే తెలుసు.

"గాడ్ మిట్...ఐదుకింక అయిదు నిముషాలుంది. హారియప్...త్వరగా బోర్డర్ వైపు పదండి" అరిచాడు బిశ్వాస్ ఆర్/టిలో...

"బట్ లీడర్! మనం ఈ పెట్రోల్ లో బేస్ వరకూ వెళ్ళలేం" అరిచాడు వినయ్.

"డోంట్ వర్రీ...బోర్డర్ ఎంతో దూరంలేదు. మన భూభాగంలోకి వెళ్ళగానే బెయిలవుట్ అయిపోదాం... బయటికి దూకగానే పారాచూట్లు చిక్కుపడకుండా విప్పుకోవాలని దేవుణ్ణి ప్రార్థించుకోండి" అన్నాడు బిస్వాస్ మరో ముప్పై మైళ్ళలోవున్న భారత భూమివైపు మిగ్-21ను వురికిస్తూ.

—: ఐపోయింది :—

# ఖూనీకోర్ !

## కె. విజయలక్ష్మి

రాత్రి పదకొండు గంటలయింది.

గంటక్రితంనుంచీ తుప్పరపడుతున్న వాన ఉన్నట్లుండి పెద్దదయి జోరుగ కురవటం మొదలుపెట్టింది.

పెరల్ బక్ రచన చదువుతున్న నీరజ పుస్తకంలోంచి తల పైకెత్తి గడియారంవైపు చూచింది.

పదకొండు దాటి పదినిమిషాలు.

బద్దకంగా వళ్ళు విరుచుకుని పుస్తకం మూసేసి మంచం మీదనుంచి లేచి కిటికీదగ్గరకు నడిచి కిటికీ తలుపులు తెరిచి బైటకు చూచింది నీరజ.

ఉండుండి వురుములు మెరుపులతో తీవ్రంగా వాన పడుతున్నది. స్ట్రీట్ లైట్స్ వానకి కాబోలు పోయాయి.

బయటంతా చీకటిగా వుంది.

"వారొచ్చి తలుపు కొట్టినా వినపడక పోవచ్చు గేటు గడియ తీసి వస్తే సరి" అనుకుంటూ నీరజ గొడుగేసుకుని గేటు తలుపుల గడియ తీసి ఇంట్లోకి వచ్చింది.

లోపలి తలుపు గడియవేసుకుని భర్త రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

నీరజ భర్త రామ్మూర్తికి రైల్వేలో పని. ఏ. ఎస్. యమ్. రిలీవింగ్ తిరుగుతుంటాడు. పక్కవూరి స్టేషన్ మాస్టరు పదిహేను రోజులు శలవు పెడితే అతని డ్యూటీ చేస్తున్నాడు రామ్మూర్తి నాలుగు రోజులనుంచి.

డ్యూటీ ముగించుకొని రాత్రి ఎనిమిదిగంటల బండికి బయలుదేరి పదకొండు గంటలకి ఇంటికి వస్తాడు. తిరిగి ఉదయం ఆరుగంటలకు ఇంట్లో బయలుదేరి వెళతాడు డ్యూటీకి.

"ట్రైన్ లేటయి వుంటుంది. పదకొండుంబావయినా రాలేదు. వెధవ ఉద్యోగం వెధవ డ్యూటీలు" విసుక్కుంది నీరజ.

నీరజకు భయం ఎక్కువ. భర్త వచ్చిందాకా బిక్కు బిక్కు మంటూ మేలుకుని కూర్చుంటుంది ఎంత రాత్రయినా సరే.

మరో పదినిమిషాలు గడిచిపొయ్యాయి.

నీరజ మాటిమాటికి తలుపువైపు చూస్తున్నది, భర్త వచ్చి తలుపుతట్టి పిలుస్తాడని.

రామ్మూర్తికి రైల్వే క్వార్టర్స్ ఇచ్చారు. అందమైన క్వార్టర్స్ చుట్టూ చెట్లు పెట్టుకోటానికి స్థలం, ప్రహరీ, చూడటానికి బాగుంటుంది ఆ లైనంతా, రైల్వే క్వార్టర్స్ ఒకేవైపువి కావటంవల్ల.

తలుపులు దబదబ చప్పుడయ్యాయి.

గబుక్కున లేచి ఒక్కంగలో వెళ్ళి తలుపు గడియ తీసింది నీరజ.

"బ్రైన్ లేటయినట్లుంది. తడిశా..." నీరజ నోరు ఠక్కున మూసుకుంది.

నీరజ తలుపు తీయంగానే నీరజను తోసుకుంటూ లోపలకి వచ్చింది రామ్మూర్తి గాదు. ఎవరో ఒకతను.

నీరజ నోట్లోంచి మాట రావటంలేదు గజగజ వణికిపోతూ కళ్ళప్పగించి నుంచుంది.

లోపలికొస్తూనే అతను తలుపు గడియ బిగించి తలుపు కానుకుని నుంచున్నాడు. తాపీగా జేబులోంచి పిస్టల్ తీసి నీరజవైపు చూపించాడు.

"నా పేరు బలరాం" అన్నాడు అతను.

అయోమయంగా తలవూపింది నీరజ, పరిశీలనగా బలరాంను చూస్తూ.

బలరాం ఎత్తుకు తగిన లావులో హుందాగా వున్నాడు. బ్లాకలర్ పాంటు కోటు వేసుకున్నాడు. వానలో రావటం వల్ల పూర్తిగా తడిసి నీళ్ళు కారుతూ నుంచున్నాడు.

"నే చెప్పేది జాగ్రత్తగావిని, వివేకంతో ప్రవర్తించు. నన్ను పోలీసులు వెంటాడుతున్నారు. పారిపోయి ఇలా వచ్చాను. ఏ క్షణానయినా పోలీసులు రావచ్చు, రావచ్చేమిటి వస్తారు. వాళ్ళొచ్చి వెళ్ళిందాకా దాక్కుంటాను. నేను మీ ఇంట్లో దాక్కున్నట్లు పోలీసులకు చెప్పావా, నీ ప్రాణాలేకాదు. నీ వాళ్ళందరి ప్రాణాలూ తీస్తాను. నాకు మేలు చేస్తే నీకు మేలు చేస్తాను. కీడుతలపెట్టావా, అంతు చూస్తాను. ఇప్పుడు పోలీసులకు పట్టిచ్చినా, తరు

వాత బైటకు రాంగానే ముందు పగ తీర్చుకోటం నీమీద నీవాళ్ళ మీద. వింటున్నావా?''

తల వూపింది నీరజ వింటున్నా నన్నట్లు.

''పోలీసులు నమ్మేవిధంగా చెప్పాలి - ఇటెవరూ రాలేదని.''

''అలాగే'' మొదటిసారి నోరు తెరిచింది నీరజ.

''దాక్కోటానికి చోటు చూపించు.''

''దొడ్డి దోవన పారిపోవచ్చుగా?'' నీరజ ధైర్యం తెచ్చుకుని అంది.

''నిన్ను సలహా లెవరూ అడగటంలేదు. చెప్పింది చెయ్యి. యీ పిస్టల్ యిప్పటికి ఎందరి ప్రాణాలుతీసిందో నాకే లెక్క తెలియదు. గుర్తుంచుకో!''

భయంభయంగా చూసింది పిస్టల్ వైపు.

''నువ్వుగాక ఇంకెవరయినా వున్నారా ఇంట్లో?''

''ఊహూ.''

బలరాం తృప్తిగా తల ఆడించి కిటికీలోంచి బైటకు చూచాడు.

ఇళ్ళమీదకు పడుతున్న టార్చిలైట్ వెలుగుచూచి పోలీసులు తనని వెదుకుతు వస్తున్నట్లు గ్రహించాడు బలరాం. చటుక్కున కిటికీ తలుపులు వేసి బోల్ట్ బిగించాడు.

''పోలీసులు నన్ను వెదుకుతు వచ్చేస్తున్నారు, తొందరగా దాక్కోటానికి స్థలం చూపించు. వాళ్లొచ్చి అడిగితే నమ్మేవిధంగా అబద్ధం చెప్పు. ఏమాత్రం పొరపాటు చేసినా నా చేతిలో మీ కుంటుబం మొత్తం సఫా గుర్తుంచుకో, ఊఁ..తొందరగాచూపు దాక్కోటానికి చోటు'', బలరాం తొందర చేశాడు.

నీరజ పాతసామానులు పడేసిన చిన్నగది వుంటే అక్కడికి తీసుకెళ్ళింది బలరాంని.

గది తలుపులు తెరుస్తూనే రెండు ఎలుకలు, నాలుగు బొద్దింకలు జైల్లోంచి బైటపడ్డ ఖైదీలా హుషారుగా బైటికి వచ్చాయి.

పోలీసులు వచ్చేసినట్లున్నారు. తలుపుపై దబదబచప్పుడయింది.

నీరజ కంగారుగా బలరాంని గదిలోకి తోసింది. తలుపులు చేరవేసి గొళ్ళెం పెట్టింది.

## 2

"తలుపు తియ్యండి" కర్కశంగా స్వరము, తలుపు తట్టిన చప్పుడు మరోసారి వినపడింది.

నీరజ తలుపు తీసి చేత్తో కళ్ళు నులుముకుంటు... "ఇంతాలశ్యం అయిదేమండీ, ట్రైన్ లేటయిందా ఏమిటి?" అని తల ఎత్తి పోలీసులను చూచి "అ...!" అంది నిర్ఘాంత పోతున్నట్లు ముఖం పెట్టి.

గుమ్మం అవతల ఇద్దరు పోలీసులు వున్నారు.

"ఏ...ఏమయిందడి? ఎందుకొచ్చారు?" కంగారుగాను, భయం భయంగాను అడిగింది నీరజ.

"ఇంట్లో మీరొక్కరే వున్నారా?" మెడ రిక్కించి లోపలికి చూస్తూ అడిగాడు ఒక పోలీసు.

"మావారు డ్యూటీనుంచి రాత్రి పదింటికి రావాలి. రాలేదు. ఇంట్లో వుండేది నేను మావారు మాత్రమే. దేనికి. వారేమయినా..." అనుమానాస్పదంగా అంది నీరజ.

"ఒకతన్ని వెంటాడుతూ ఇటొచ్చాము. ఈ లైను లోకే పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతనొక హంతకుడు'

ఇప్పటికో డజనుమందిని చంపాడు. మనుషులని చంపటం అతనికి హల్వా తిన్నంత తేలిక. ఎవరైనా పరుగెత్తుకొచ్చిన చప్పుడు మీకేమయినా వినపడిందా?"

"ఉహూ, నే నిద్రపోతున్నాను. తలుపు చప్పుడు విని మావారు వచ్చారనుకుని తలుపులు తీశాను."

"ఓసారి ఇంటిచుట్టూ చూచి వెళతాము. ఒంటరిగా వున్నానంటున్నారు జాగ్రత్తగా వుండండమ్మా." పోలీసు టార్చిలైట్ ఫోకస్ క్రోటన్స్ చెట్లమీదకు వేస్తూ అన్నాడు.

"నాకసలే భయం. కిటికీలుకూడా వేసుకుని పడుకుంటాను. మావారొచ్చిందాకా మీరెవరైనా వాకిట్లో వుంటారా?"

"తలుపులేసుకుని జాగ్రత్తగా వుండండి. ఇంట్లోను బైట అన్ని లైట్స్ వెలిగించి వుంచండి. మీవారొచ్చి పిలిస్తే వచ్చింది మీవారా, కాదా, నిర్ధారణ చేసుకుని తలుపులు తెరవండి. అతన్ని వెతికి వెంటనే పట్టుకోకపోతే మా ఉద్యోగాలు వూడవచ్చు. మరికొన్ని హత్యలు జరగవచ్చు. జాగ్రత్తగా వుండండి," మరోమాటకు అస్కారం యివ్వకుండా ఇరువురు పోలీసులు ఇంటిచుట్టూ వెతకటానికి వెళ్ళిపోయారు.

నీరజ తలుపులు బిగించింది. కాసేపు అక్కడే నుంచుండిపోయింది.

'తను భద్రంగా దాచింది ఓ హంతకుడినా? తెలిసి నేరం చేయటం ఘోరమైన నేరం. పోలీసులను పిలిస్తే వెంటనే పట్టుకెళతారు, నేరసుడిని పట్టిచ్చిన ఘనత దక్కుతుంది. కాని...మళ్ళీ ఎప్పుడో పారిపోయివచ్చి తన

కుటుంబంపై ప్రతీకారం తీర్చుకోడని ఏమిటి? ఇప్పుడు మటుకు తను వంటరిగా ఇంట్లో వుంది. ఏదయినా అఘాయిత్యం చేస్తాడేమో! లేక రక్షించినందుకు తన దారిన తాను పోవచ్చు. ఏం చేయాలి?'

టక్. టక్. వేళ్ళతో తలుపుమీద కొట్టిన చప్పుడు వినిపించింది నీరజకు. తలుపువైపు చూచింది.

చప్పుడు వీధి తలుపుది కాదు. బలరాం వున్న గది తలుపుది.

'పోలీసులు చాలామారం వెళ్ళిపోయి వుంటారు. ఆలోచించి ప్రయోజనం లేదు' అనుకుంటూ మొండి ధైర్యంతో వెళ్ళి బలరాం వున్న గదితలుపు తెరిచింది నీరజ.

"థాంక్స్! నీ మేలు జన్మలో మరచిపోను. నువ్వు పోలీసులతో మాట్లాడిందంతా విన్నాను." బలరాం గది లోంచి బైటకు వస్తూనే అన్నాడు.

'మాటల్లో సంస్కారం కనపడుతున్నది. హంతకుడు కావటానికి కారణమేమిటో?' అనుకుంది నీరజ.

బలరాం కుర్చీలో కూర్చుని నీరజను నఖశిఖ పర్యంతం పరీక్షగా చూచాడు.

నీరజకు ముప్పై ఎనిమిదేళ్ళు వుంటాయి. పచ్చని పసిమి వర్ణం. నల్లని వత్తయిన తలకట్టు. శరీరం గుండ్రంగా, నున్నగా పిటపిటలాడుతూ ముప్పైఏళ్ళదానిలా వుంది. చూడంగానే అందగత్తె అని తెలిసిపోతుంది. నీరజకు పదెనిమిదో ఏట ఆడపిల్ల, ఇరవై నిండంగానే మొగపిల్ల వాడు పుట్టారు. నీరజ కూతురు సరోజ పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళింది. కొడుకు శ్రీధర్ బి. కామ్. చదువు అన్నాడు పట్నం హాస్టల్లో వుండి. ఇద్దరి పిల్లల తల్లి నీరజ అంటే ఎవరూ నమ్మరు.

బలరాం తన్ను పరీక్షగా చూడటం చూచి బిడియంగా ముఖం దించుకుంది నీరజ.

"పోలీసులు వెళ్ళిపోయారు, ఇంక మీరు వెళ్ళవచ్చు." నిదానంగా చెప్పింది నీరజ.

ఫక్కున నవ్వాడు బలరాం.

నీరజ శరీరం చిగురుటాకులా కంపించింది.

"నేనీ రాత్రికి వుంటే నీకేమన్నా కష్టమా?" కోటు విప్పుతూ అడిగాడు బలరాం.

"మావారు వచ్చే వేళయింది. ఉత్త అనుమానం మనిషి. మీరుండటానికి ఒప్పుకోరు."

"మీవారు ఇంట్లో వున్నంతసేపు రహస్యంగా దాచు' ఇందాకటి గది వుంది. ఇక్కడ పైన అటక వున్నట్లుంది. నీ జాగ్రత్తలో నీవు, నా జాగ్రత్తలో నేను వుందాము."

"అలా కుదరదు" అనబోయింది నీరజ. కోటు విప్పంగానే బలరాం జబ్బమీద గాయం కనపడి కంగారుగా "అదేమిటి? చెయ్యంతా రక్తం కారి గడ్డకట్టింది" అంది.

"ఒకచోట కాదు రెండుచోట్ల. తుపాకీ గుండ్లు తగిలాయి." పాంటు విప్పుతూ చెప్పాడు బలరాం నవ్వుతూ.

బలరాం ఇప్పుడు డ్రాయరు కట్ బనీనుతో వున్నాడు. కాలిపిక్కకు, చేతిజబ్బకు రెండుచోట్ల గుండు తగిలిన గాయం వుంది. కాలిమీద అయితే ఇంకా రక్తం కారుతూనే వుంది.

నవ్వుతున్న బలరాంని చూస్తూ అవాక్కయి నుంచుండిపోయింది నీరజ.

బలరాం శరీరం బలిష్టంగా కండలు తిరిగివుంది. శరీరమంతా దట్టంగా వెంట్రుకలు వున్నాయి. శరీరం చామన

చాయ అయినా ఛాతీకి, కాళ్ళకి, చేతులకి నల్లని జుట్టు వెంట్రుకలు వుండటంవల్ల నల్లని నలుపు అనిపిస్తున్నాడు. వయసు ముప్ఫై దాటివుండదు. ముఖం పాలుకారుతూ అమాయకంగా పందొమ్మిదేళ్ళ కుర్రాడిలా వున్నాడు.

నవ్వుతూ నిర్మలంగా వుండే ఇతను పన్నెండుమందిని హత్యచేసిన హంతకుడా?

"మీరు వెళ్ళిపొండి. మావారు ఏ నిమిషానయినా రావచ్చు."

"నాలుగుసార్లు మాట్లాడటం, ఎటు గాలి వీస్తే అటు పోవటం నా మతం కాదు. బైటకు వెళితే పోలీసులకు చిక్కటం ఖాయం. వలపన్ని అన్నిమార్గాలలో నాకోసం కాపలా కాస్తున్నారు. గుండుదెబ్బ తగిలిన గాయం, తగిలిన రోజుకన్నా మర్నాటికి నొప్పి ఎక్కువచేసి జ్వరంవస్తుంది. అనుభవం నాకు. ఓ నాలుగురోజులు ఇక్కడే వుండి వెళతాను. వుండమంటావా? వెళ్ళమంటావా? తొందరగా చెప్పేయి."

"వెళ్ళిపొండి." తెగించి అంది నీరజ.

"ఆల్ రైట్ వెళతాను. మీవారు వస్తారన్నావు కదా, తలుపు తీస్తూనే నీ కళ్ళముందు మీవారిని షూట్ చేసి ఆపై నిన్ను షూట్ చేసి మరీ వెళతాను." బలరాం పిస్టల్ చేతిలోకి తీసుకొని అన్నాడు.

నీరజ కాళ్ళల్లోంచి వణుకు బైలుదేరింది.

"మావారు రాత్రిళ్ళు వచ్చి ఉదయం అయిదున్నర ట్రైన్ కి వెళుతుంటారు. రాత్రంతా గదిలో దాక్కోండి. రెండుమూడురోజులు కాపాడతాను. మాకేమీ కీడు చేయకుండా వుండండి." గత్యంతరం లేక అంది నీరజ.

"పిల్లలున్నారా?" ఉన్నట్లుండి అడిగాడు బలరాం.

"ఊ" ఎందుకడిగాడో అర్థం కాలేదు నీరజకు.

"నేను మీ ఇంట్లో వున్నన్నాళ్లూ నాగురించి రెండో ప్రాణికి తెలియనివ్వనని మీ పిల్లలమీద ప్రమాణం చెయ్యి."

అయిష్టంగానే ప్రమాణం చేసింది నీరజ.

"పగలు కావాలంటే ఆగదిలో దాక్కుంటాను, గదిలో నుంచోటానికి తప్ప కూర్చోటానికి చోటులేదు, అటక మీద పడుకుంటాను" ఇంటి యజమానిలా హుందాగా అన్నాడు.

"ఊ"

"ఇంట్లో మందేమయినా వుంటే యివ్వు ప్రస్తుతానికి గాయానికి రాచి రేపు ఏంచేయాలో ఆలోచిస్తాను. దూది గుడ్డ కూడా కావాలి. తాగటానికి పాలుగాని, మజ్జిగ గాని యివ్వు" బలరాం ఆజ్ఞాపిస్తున్నట్లే అన్నాడు.

కిక్కురుమనకుండా నీరజ పెనిసిలిన్ ఆయింటుమెంటు, దూది, తెల్లచీరలో గుడ్డ, ఇచ్చి, ఆ తరువాత పాలువెచ్చబెట్టి ఇచ్చింది బలరాంకి.

బలరాం ఇంట్లో మనిషిలాగా తాపీగా గాయానికి కట్టు కట్టుకుని, పాలుతాగి అక్కడే వున్న స్టాండుమీద లుంగీ కట్టుకున్నాడు.

నరాలన్నీ చచ్చుపడ్డట్లు అయినాయి నీరజకు. "అపకారం ఏమీ చెయ్యవు కదూ?" అంది హీనస్వరంతో.

"పాముకి పాలుపొయ్యకు. అది కాటేసి తీరుతుంది. మనిషికి పాలు ఇవ్వు. మరచిపోడు మే లన్నటికీ" గంభీరంగా అన్నాడు బలరాం.

'తల్లిపాలు తాగి ఆ తల్లి రొమ్ముగుద్దే తనయు లున్నారు' మనసులో అనుకుంది నీరజ.

"గుడ్ నైట్, పైకెక్కి పడుకుంటాను. నువ్వు పిలిచి నప్పుడు తిరిగి కిందకు వస్తాను. రెండురోజులబట్టీ నిద్ర లేదు" ఆవులిస్తూ అన్నాడు బలరాం.

'భగవంతుడా నువ్వు రక్షించాలిసిందే నన్ను' అను కుంది నీరజ.

బలరాం బనీనుకూడా విప్పి, పాంటు, బనీను, కోటు ఉండచుట్టి చంకన పెట్టుకుని అటక ఎక్కాడు.

బలరాం వీపుమీద అరచేయి అంత కంతి చూసింది నీరజ బలరాం అటక ఎక్కేటప్పుడు.

బిక్కుబిక్కుమంటూ భర్త రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది నీరజ.

# 3

"నీరజా! నీరజా!"

తలుపు తట్టుతూ తన పేరు పిలుస్తున్నది భర్త రామ్మూర్తి అని గ్రహించింది నీరజ.

బైట నుంచి రామ్మూర్తి మరోసారి నీరజ పేరుపెట్టి తలుపు గట్టిగా తట్టాడు.

నీరజ తలుపు తెరిచింది.

పూర్తిగా వానకు తడిసిన రామ్మూర్తి నీళ్ళు కారుతూ ఇంట్లోకి వచ్చాడు.

మౌనంగా టవలు, లుంగీ అందించింది నీరజ.

"ఇంజన్ పాడయి ట్రైన్ గంటన్నర లేటు. ఇక్కడికి వస్తూనే దరిద్రగొట్టు వాన, వెధవ డ్యూటీ. తెల్లారుతూనే మళ్ళీ వెళ్ళాలి." టవల్‌తో తల తుడుచుకుంటూ చెప్పు తున్నాడు రామ్మూర్తి.

అన్నింటికి 'ఊ' కొడుతున్నది నీరజ.

"ఇప్పుడు భోజనం చేయను, మధ్యలో టిఫిన్ తిన్నాను. పాలుగాని, మజ్జిగగాని ఓ గ్లాసు యివ్వు చాలు."

"పాలు లేవు." అని నోరు జారినందుకు నాలుక కొరుక్కుంది నీరజ.

"పాలు ఏమయ్యాయి? యీ పూట పాలమనిషి రాలేదా?"

"ఇంత రాత్రిదాకా పాలు వుంటాయా? తోడేశాను. మజ్జిగ తెస్తాను."

"ఏదో ఒకటి తీసుకురా." మంచంమీద కూర్చుంటూ అన్నాడు రామ్మూర్తి.

నీరజ మజ్జిగ తెచ్చియిస్తే తాగాడు రామ్మూర్తి. పక్క మంచంమీద పడుకోబోతున్న నీరజను చూచి దగ్గరకు పిలిచాడు రామ్మూర్తి.

"నాకు తల నొప్పిగా వుంది. పడుకోండి." దుప్పటి నిండా ముసుగుపెడుతూ అంది నీరజ.

రామ్మూర్తి ఏమీ అనకుండా లైటు ఆర్పి నిద్ర పోయాడు.

తిరిగి ఉదయం ఆరుగంటలకు రామ్మూర్తి డ్యూటీకి వెళ్ళిపోయాడు. మళ్ళీ రాత్రి పదకొండుగంటలకే రావటం.

రామ్మూర్తి అటు వెళ్ళంగానే బలరాం అటక దిగి వచ్చాడు. కాలు బాగా నొప్పిచేసింది కుంటుతున్నాడు. చెయ్యి కదిలించలేకుండా వున్నాడు. రాత్రంతా జ్వరం తగిలింది. మూలుగుతున్నాడు.

నీరజ గ్లాసునిండా వేడికాఫీ యిచ్చింది.

"అటకమీదకన్నా జైలు నయం. హాయిగా పడుకో

వచ్చు," కాఫీ తాగుతూ అన్నాడు బలరాం.

బలరాంవైపు కోపంగా చూచి తల తిప్పుకుంది నీరజ.

"బజారునుంచి కొన్ని వస్తువులు కావాలి, తెచ్చి పెట్టాలి."

"ఇలా నా ప్రాణం తీసే బదులు, చంపు ఒక్కసారిగా." కోపంగా అంది నీరజ.

"ఉపకారికి అపకారం చేయటం నా కలవాటులేదు. రెండురోజులు నీ తమ్ముడి ననుకుంటూ సాయం చెయ్యి. నా దోవన నేను పోతాను."

నీరజ ఏమీ అనలేదు.

కాఫీ తాగటం పూర్తిచేసి బలరాం విశ్రాంతిగా మంచంమీద పడుకున్నాడు. ఆ మంచం రామ్మూర్తి పడుకునేది. దర్జాగా పడుకున్న బలరాంని చూస్తుంటే నీరజ మనసు చివుక్కుమంది.

"తుపాకీగుండ్లు నాకు తగిలాయని పోలీసులకు తెలుసు' ప్రతి క్లినిక్ వద్ద నా కోసం కాపు కాస్తుంటారు. డాక్టరు వద్దకు వెళ్ళటం ప్రస్తుత పరిస్థితులలో సరాసరి పులి బోనులో జొరబడినట్లే..."

బలరాం చెప్పబోయేదేమిటో అర్థం కాలేదు నీరజకు' ఈ సోది ఏమిటన్నట్లు విసుగ్గా చూచింది.

"రాత్రి జ్వరం వచ్చింది. ఇప్పుడుకూడా వుంది. గాయం సెప్టిక్ కాకముందే జాగ్రత్తపడాలి. కాబట్టి, నీవు బజారువెళ్ళి కొన్ని మందులు, అవసరమయిన సామాను తెచ్చిపెట్టు. ఇంజక్షన్ నా అంతట నేను చేసుకోగలను. సిరంజి, కాటను, గాజుగుడ్డ, బేండేజ్, లోషను, మాత్రలు, సిగరెట్స్ కావాలి. తొందరగా తెచ్చిపెడితే..." నీరజ

ఏమంటుందో అని ఆగిపొయ్యాడు బలరాం.

'శాస్త్ర విషంకూడా ఆ చేత్తో తేనా?' కసిగా అను కుంది నీరజ.

"ఏం మాట్లాడవేమిటి?" రెట్టిస్తున్నట్లు అడిగాడు బలరాం.

"నావద్ద పైసా లేదు. మావారు నాకివ్వరు డబ్బు. అంతా వారే చూచుకుంటారు."

చీరల మడతల్లో నాలుగు వందలదాకా డబ్బుంది. కావాలని అంది నీరజ, బజారుకెళ్ళటం తప్పించుకోవచ్చు కదా అని.

"నా జేబులో ఏడువందల పైన చిల్లర నలభై రూపా యలదాకా వుంది. కావాలిసింది తీసుకుని వాడు."

నీరజకు తప్పలేదు. మందుల పేర్లు, కావలసిన సామగ్రి లిస్ట్ రాసుకుని రెండొందలు తీసుకుని బజారు బైలుదేరింది.

"బైటకు వెళుతున్నావు. నా గురించి ఏమాత్రం నోరు జారినా ఫలితం తెలుసుగా?" బలరాం హెచ్చరించాడు.

"గోటితో పోయేదానికి గొడ్డలి వుపయోగించను. దుర్మార్గపు పనులుచేయుటం మా ఇంటా వంటా లేదు. పిల్లలమీద ప్రమాణం చేయించావు. చాలదా?" అక్క సుగా అని విసురుగా బైటకు వచ్చింది నీరజ.

ఇంటి తలుపు తాళంవేసి బజారు బైలుదేరింది.

"బలరాం తనింట్లో వున్నట్లు చెబితే చాలు నిమిషాల మీద పోలీసులు పట్టుకెళతారు. ఖర్మకాలి మళ్ళీ బలరాం పోలీసుల చేతిలోంచి తప్పించుకుంటే, తన భర్తనుకాని, పిల్లలమీద కాని దెబ్బతీసి జీవితాంతం తనకి శోకం మిగల్చడనేముంది? తన శీలం కోరకుండా వుంటే చాలు,

అదే పదివేలు. నాలుగురోజులు జాగ్రత్తగావుంటే వెళ్ళి పోతాడు.''

బలరాం గురించి ఆలోచిస్తూ బజారుకొచ్చేసింది నీరజ.

ముందుగా మందులషాపుకెళ్ళి కావలసినవి తీసుకుంది. తరువాత బ్రెడ్ తీసుకుని కిళ్ళీ షాపువద్దకు వెళ్ళింది.

''చార్మినార్ సిగరెట్టు పెట్టెలు డజను కావాలి.'' అంది కిళ్ళీషాపువాడితో గొణిగినట్లు అని తల దించుకుంది నీరజ.

తనన్నది పొరపాటు కాదు కదా, అనుకుంటూ ''ఏం కావాలి అమ్మా?'' అన్నాడు కిళ్ళీషాపువాడు, పరిశీలనగా నీరజవైపు చూచి.

''బజారు వస్తున్నా కదా అని మావారు ఇదికూడా నన్నే తెమ్మన్నారు. చార్మినార్ సిగరెట్టుపెట్టెలు డజను.'' విసుగ్గా అన్నట్లు చెప్పింది నీరజ. మావారు అని చెప్పకోవలసి వచ్చినందుకు మనసు విలవిలలాడింది.

కిళ్ళీషాపువాడు డజను సిగరెట్ పెట్టెలు యిచ్చి డబ్బులు తీసుకున్నాడు.

నీరజ ఇంటికి బైలుదేరింది.

ఇంటికి తొందరగా వెళ్ళాలనే ఆదుర్దాతో నీరజ వేగంగా నడుస్తున్నది. భుజాన చెయ్యి బలంగా పడటంతో చటుక్కున ఆగిపోయింది.

నీరజ స్నేహితురాలు పార్వతి నవ్వుతూ పలకరించింది.

నీరజ రైల్వే క్వార్టర్స్‌లో వుంటే, పార్వతి పాత బస్సుస్టాండు పక్కసందులో వుంటుంది. ఇద్దరిళ్ళ మధ్యా రెండుమైళ్ళ దూరం వుంది. ఎప్పుడో తప్ప కలుసుకోరు.

''పొద్దున్నే బజారు వచ్చావు, ఏంటీ సంగతి? ఎలా

వున్నావ్! పిల్లలు కులాసా? ఉత్తరాలు వస్తున్నాయా సరోజవద్దనుంచి?" గబగబ ప్రశ్నలవర్షం కురిపించింది పార్వతి.

"ఆ...ఆ...అంతా కులాసే. కూరలకి, కొన్ని వెచ్చాలకి వచ్చాను. ఓసారి ఇంటికి రా, తీరుబడిగా మాట్లాడుకుందాము. అర్జంటుగా వెళ్ళాలి," అంటూ మరోమాటకి ఆస్కారం లేకుండా నీరజ వేగంగా ముందుకు సాగింది.

'నే కనపడితే చాలు. అర్జెంట్ పని వుందన్నా వినక గంటల తరబడి హాస్కుకొట్టే నీరజ దులపరించుకున్నట్లు మాట్లాడి వెళ్ళిపోయిందేమిటబ్బా?' నీరజ వెళ్ళినవైపే చూస్తూ అనుకుంది పార్వతి.

# 4

"వెరీగుడ్, నే చెప్పినవన్నీ తెచ్చావన్నమాట. నా అంచనా తప్పుకాదు. నీవు చాలా మంచిదానివి."

నీరజ బజారునుంచి తీసుకొచ్చిన చార్మినార్ సిగరెట్ పెట్టెనుంచి సిగరెట్ తీసి వెలిగించుకుని తృప్తిగా పొగ పీలుస్తూ అన్నాడు బలరామ్.

ఇంట్లోకి రాగానే నీరజ తలుపులు, కిటికీలు, లోపలి గడియలు బిగించింది. మాట్లాడకుండా వంటగదిలోకి వెళ్ళింది.

"ఇంట్లో థర్మామీటరుందా?"

లేదంటే మళ్ళీ బజారువెళ్ళి తెమ్మంటాడేమో అని థర్మామీటరు తెచ్చియిచ్చింది నీరజ.

థర్మామీటరు విదిలించి నోట్లో పెట్టుకున్నాడు బలరాం.

నీరజ అక్కడే నుంచుంది.

"నూటమూడు రెండు పాయింట్లు వుంది జ్వరం, దెబ్బ తగిలిన సలుపుకి వచ్చుంటుంది జ్వరం." అన్నాడు బలరాం.

"అంతే అయివుంటుంది." అంది నీరజ.

"గాయం క్లీన్ చేసి మందువేసి డ్రస్ చేస్తాను. వేడి నీళ్ళు కాచి తెచ్చిపెట్టు," బలరాం మరో సిగరెట్ ముట్టించి అన్నాడు.

నీరజ మాట్లాడకుండా వేడినీళ్ళు కాచి, అవి, మందులు తెచ్చియిచ్చింది.

బలరాంని చూస్తూ అక్కడే నుంచుంది నీరజ.

బలరాం రాత్రి గాయాలకు చుట్టిన గుడ్డలు విప్పి పక్కన పెట్టాడు. వేడినీళ్ళలో లోషన్ వేసి, ఆ నీటిలో దూదిని ముంచి గాయాన్ని శుభ్రంచేశాడు. మందు రాచాడు అనుభవమున్న డాక్టరులా, చకచక డ్రస్సింగ్ చేశాడు. ఆ తరువాత మాత్రలు వేసుకొని స్వయంగా ఇంజక్షన్ చేసుకున్నాడు.

"కాలికి చేతికి తుపాకీగుండ్లు రాచుకుంటూ దూసుకు పోయాయి. గుండు లోపల వున్నట్లయితే చాలా శ్రమ పడాల్సి వచ్చేది" నవ్వుతూ చెప్పాడు బలరాం.

"గుండు లోపల వుంటే ఏమవుతుంది?"

"ప్రాణాపాయం జరుగుతుంది" తేలిగ్గా చెప్పాడు బలరాం.

"అప్పుడు డాక్టరు దగ్గరకు వెళ్ళక తప్పదుగా?"

"శరీరంలో కొన్ని ప్రదేశాలలో గుండు వుంటే ఎవరికి వారే తీసుకోవచ్చు. ధైర్యం, బాధ ఓర్చుకోటం, చాకచక్యం, మూడూ వుంటే సరి. ఓసారి కాలిలో తుపాకీ గుండు ఇరుక్కుంది. రక్తం కారకుండా గట్టిగా టవల్

చుట్టి పారిపొయ్యాను. నే దాక్కున్నది అడవిప్రదేశం. రెండో మనిషి లేడు. గుండు కాలిలో వుంటే ప్రాణం తీస్తుంది. నావద్ద చిన్న చాకు తప్ప మరేవిధమైన ఆయుధం లేదు. ఆ చిన్న చాకుతోనే గాయాన్ని పెద్దదిచేసి కాలిలోంచి గుండు బైటకు తీశాను. రక్తం బడబడ కారి పోతున్నది. మందులేదు, కాటన్ లేదు. గుడ్డముక్క కూడా లేదు. పక్కనేవున్న చెట్టుఆకులు చేత్తో నులిపి, గాయం మీద వేసి చొక్కా చింపి గట్టిగా కట్టుకట్టాను. ఆ ఆకు లేమిటో కూడా తెలియదు.

ఆకలి దహించుకుపోతున్నది. గాయం సలుపు. చలి శరీరంమీద బనీను డ్రాయరు రక్తంతో లాగంతా తడవ టంవల్ల విప్పిపారేశాను. దాహంతో నాలుక పిడచకట్టుకు పోతున్నది. ఇది యిలా వుంటే అడవిలో..."

"ఆగండి! ఎవరో గేటు తీస్తున్న చప్పుడవుతున్నది."

బలరాం చెపుతున్నది శ్రద్ధగా వింటున్న నీరజ చెవులకి గేటు కిర్రుమన్న శబ్దం వినపడింది. కిటికీ తలుపులు కొద్దిగా తెరిచి బైటకు చూచింది.

నీరజ గుండెకాయ ఒక్క క్షణం ఆగి తిరిగి పనిచేయటం మొదలుపెట్టింది. కిటికీ తలుపులు చటుక్కున వేసింది.

ఎవరో ఇంట్లోకి రాబోతున్నట్లు, వాళ్ళనుచూచి నీరజ భయపడుతున్నట్లు బలరాం గ్రహించాడు. ఏమిటన్నట్లు చూచాడు.

నీరజ, బలరాం వద్దకు వచ్చి చెవిలో గుసగుసలాడింది.

"మా అమ్మాయి, వాళ్ళత్తగారూ వస్తున్నారు.తొందరగా గదిలోకి వెళ్ళి దాక్కో, ఇక్కడంతా నేసర్దుతాను వాళ్ళెందుకొస్తున్నారో ముందుగా నాకు తెలియను

కూడా తెలియదు'' నీరజ, బలరాంని తొందర చేసింది.

బలరాం విసుగ్గా లేచి కుంటుకుంటూ పాతసామానులు పడేసిన చిన్న గదిలోకి వెళ్ళాడు.

''అమ్మా! అమ్మా! తలుపుతియ్యి'' బైటనుంచి సరోజ తలుపు తడుతూ పిలిచింది.

నీరజ చకచక బలరాంకి సంబంధించిన సామానంతా దాచింది. పొరపాటుగా ఏమీ వదలలేదుకదా అని మరో సారి పరీక్షగా చూచి, తలుపువద్దకు నడిచింది.

బైటనుంచి సరోజ ''అమ్మా! అమ్మా!'' అంటూ కేకలు పెడుతూ దబదబ తలుపుపై చేత్తో తట్టుతూనే వుంది.

''వచ్చె. వచ్చె!'' అంటూ తలుపు తీసింది నీరజ.

చిన్నబ్యాగ్‌తో సరోజ పక్కనే సరోజ అత్తగారు నుంచుని వున్నారు.

''నువ్వాటే సరూ! రండి వదినగారూ!'' అంటూ నీరజ పలకరించింది.

''ఇందాకటి నుంచీ పిలుస్తుంటే పలకలేదేమిటమ్మా?'' లోపలికి అడుగుపెడుతూ అంది సరోజ.

''లెట్రిన్‌కి వెళ్ళాను. చాలా సేపయిందేమిటి మీ రొచ్చి?'' అంది నీరజ.

''రెండు మూడు మార్లు పిలిచింది. అంతే, నీ వంట్లో కులాసాగా వుంటున్నదా వదినా?'' అంది పార్వతమ్మ.

కూతురుతోను, వియ్యపురాలు పార్వతమ్మతోను మాట్లాడుతూనే వంట పూర్తి చేసింది నీరజ. పనిమధ్యలో కంగారు పడుతూనే వుంది. పాతసామానుల గదిలో వున్న బలరాం గురించి గుర్తువస్తున్నప్పుడల్లా. ఎవరూ

చూడకుండా గదికి తాళం వేసింది, పొరపాటున సరోజ గది తలుపు తీయవచ్చు, వచ్చింది కూతురొక్కతే కాదు. వియ్యపురాలు కూడ వుంది.

పదకొండు గంటలయింది.

కబుర్లు చెప్పుకుంటూ ముగ్గురు భోజనానికి కూర్చున్నారు.

పాతసామానుల గది చాలా చిన్నది. గదినిండా సామాను కిక్కిరిసి వుంది. గదిలోకి మనిషి వెళితే నుంచోటానికి, కూర్చోటానికి తప్ప పడుకోటానికి వీలులేదు. బలరాం ఉదయం లేచింతరువాత పాస్‌కికూడ వెళ్ళలేదు. ఉత్త కాఫీ మాత్రం తాగాడు. జ్వరం ఎక్కువే అయిందో? గాయాల బాధ తీవ్రంగా వుందో? ఏదయినా అవసరం కావచ్చు. దాహం, ఆకలి, మరింకేమయినా కావాలో? ఎలా తెలుసుకోటం? ఏం చేయాలి?

నీరజ కబుర్లు చెపుతున్నదన్న మాటేగాని మనసంతా పాతసామానుల గదిలో వున్న బలరాం గురించే ఆలోచనలో మునిగిపోయింది.

"ఏమిటమ్మా పరధ్యానంగా వున్నావ్?" అంది నీరజ.

"ఇదివరకు గలగల మాట్లాడేదానివి, వచ్చినప్పటినుంచి చూస్తున్నాను, మాట్లాడుతు, మాట్లాడుతు అంతలోనే ఆలోచనలో పడిపోతున్నావు వదినా?" అంది పార్వతమ్మ.

చాతగాని నవ్వొకటి నవ్వి, వూరుకుంది నీరజ.

"అమ్మా! మీ అల్లుడుగారికి త్వరలో ప్రమోషన్ రావచ్చు" అంది సరోజ.

"నిజంగానా?" సంతోషం వ్యక్తం చేసింది నీరజ.

"నిజమే వదినా! చంద్రశేఖర సబిన్‌స్పెక్టరుగా

వుండి ఎన్నో కష్టమైన కేసులు పట్టుకున్నాడు. ప్రమోషన్ ఇచ్చి, ఇలాంటివాడిని ఇన్‌స్పెక్టర్ చేస్తే హంతకులు దొంగలు నామరూపాలు లేకుండా పోతారని పై అధికారి అన్నాడుట!'' పార్వతమ్మ కొడుకు గురించి గర్వంగా చెప్పింది.

భోజనాలు పూర్తయేలోపల చంద్రశేఖరం గురించి మాట్లాడుకున్నారు.

''అమ్మా! రేపు ఉదయం వెళతాము. నీమీద పీడకల వచ్చింది. చూడాలని బయలుదేరి వచ్చాను. అత్తగారు కూడా వస్తానంటే ఇద్దరం కలిసి వచ్చాము. రాత్రికి నాన్నగారు వస్తారుగా?'' అంది సరోజ చాపమీద దిండు పెట్టుకుని పడుకోబోతూ.

''రాత్రికి వస్తారు నాన్నగారు, యీ ఏడాది రిలీవింగ్ తిరగాల్సిందే తప్పదు'' అంది నీరజ తనూ ఒకచాప పరుచుకుని పడుకుని.

'అదేమిటే ఇవాళ వచ్చావు రేపే వెడతావా? రెండు రోజులన్నా వుండకుండా?' అని తల్లి అనకపోవటం విచిత్రంగా అనిపించింది సరోజకు.

భోంచేయగానే ఓగంట నిద్రపోవటం పార్వతమ్మకు అలవాటు. మంచంమీద పడుకుంటూనే నిద్రపోయింది చిన్నగా గురకపెడుతూ.

నీరజ నిద్రపోకుండా అటు ఇటు దొర్లటం గమనిస్తూనే వారపత్రిక తిరగేస్తున్నది సరోజ.

అరగంట తరువాత సరోజ పత్రిక మడచి పక్కన పెట్టి నిద్రపోయింది.

కూతురు నిద్రపోయిందని నిర్ధారణ చేసుకొని నీరజ చాప మీద నుంచి లేచింది.

స్టవ్ అంటించి గబగబ రెండు గొట్టెలు కాల్చి పాలు వెచ్చపెట్టి పంచదార కలిపి తరువాత బలరాం వున్న గది తలుపుల తాళం తెరిచింది.

"రొట్టె తిని పాలు తాగుదువుగాని రెడీ చేశాను. ఇంకేమయినా కావాలా తొందరగా చెప్పు?" అటూ ఇటూ దొంగచూపులు చూస్తూ చిన్నగా అడిగింది నీరజ.

"ముందు లెట్రిన్‌కి వెళ్ళాలి. మీవాళ్ళు ఏం చేస్తు న్నారు?" బలరాం స్వరం వణుకుతున్నది. సంవత్సరాల తరబడి జైలులో మగ్గుతున్న ఖైదీలాగా వున్నాడు.

"తొందరగా వెళ్ళివచ్చేయి, మావాళ్ళు నిద్ర పోతు న్నారు." నీరజ కంగారుగా బెడ్‌రూమ్‌వైపు చూస్తూ అంది.

బలరాం తూలుతూ లెట్రిన్‌వైపు వెళ్ళాడు.

ఎందుకయినా మంచిదని బెడ్‌రూమ్ తలుపులు లాగి బైట గొళ్ళెం వేసింది నీరజ.

బలరాం పది నిమిషాలలో లెట్రిన్‌నుంచి బైటకు వచ్చాడు. ఆ పదినిమిషాలు నీరజ ప్రాణానికి పది యుగా లుగా వుంది.

"టైము ఎంతయింది?" వాచీకి కీ యివ్వబోతూ అడి గాడు బలరాం.

"పన్నెండుంబావు."

"బాప్‌రే, నాలుగు గంటలు నరకంలో గడిపానన్న మాట."

"రొట్టె పాలు తీసుకురానా?"

"ఊహూ! జ్వరం చాలా ఎక్కువగా వుంది. పాలు చాలు."

నీరజ పాలు తెచ్చియిస్తే తాగాడు బలరాం.

"మీవాళ్ళు ఎన్నాళ్ళుంటారు?"

"రేపు ఉదయం వెళ్ళిపోతారు. ఈ ఒక్కరోజుకి ఎలాగో అలా గడిపెయ్యి."

"ఈ గదిలోనా, ఇంకో నాలుగు గంటలుంటే యీ బలరాం శవం మిగులుతుంది."

నీరజ ముఖం చిట్లించుకుని తీవ్రంగా బలరాంవైపు చూచింది.

"నాకు తెలుసు నీ బాధ. ఎవరూ చూడకుండా అటక ఎక్కనియ్యి, సురక్షితంగా అక్కడే వుంటాను. మళ్ళీ రేపటిదాకా అటక దిగను." బలరాం అన్నాడు.

"చిన్నగా మాట్లాడు. అవతల వింటే కొంప మునుగుతుంది. అటక ఎక్కితే ఎంత అవసరమయినా దిగటానికి వుండదు. రాత్రికి మందు కావల్సి వచ్చినా, పాలు కావల్సి వచ్చినా నే నివ్వటం పడదు."

బలరాంకి నిజమే ననిపించింది. నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు.

"లోపలికి వెళ్లు తలుపు వేస్తాను. ఏమన్నా కావాలా?".

"మంచినీళ్ళు పెట్టు. వీలయితే మధ్యాహ్నం కాఫీ అందించు." గదిలోకి వెళుతూ బలరాం అన్నాడు.

చెంబుతో మంచినీళ్ళు గదిలో పెట్టి గదితలుపు తాళం వేసింది నీరజ.

వంటింట్లోకెళ్ళి కాల్చిన బ్రెడ్ ముక్కలు దాచి బెడ్ రూమ్‌కి పెట్టిన గొళ్లెం తీసి, లోపలికి వచ్చింది నీరజ.

సరోజ వీక్లీ చదువుతూ కనిపించింది.

"నిద్ర లేచి ఎంత సేపయింది?" బి త్తరపోతూ అడిగింది నీరజ.

"పది నిమిషాలయింది. నీవు అప్పుడే లేచావేమిటమ్మా!" తల్లివైపు పరిశీలనగా చూస్తూ అంది సరోజ.

"నిద్ర పట్టలేదు. లెట్రిన్‌కి వెళ్ళివచ్చాను." చాప మీద పడుకుంటూ అంది నీరజ.

"బైట ఎవరివో మాటలు గుసగుసగా వినిపించాయి. లేచి వద్దామనుకున్నాను. మనింటి కెవరైనా వచ్చారేమో చూద్దామని. బధకించి లేవలేదు."

"అబ్బే! మనింటి కెవరూ రాలేదు, కలగన్నావేమో? లేక బైట ఎవరైనా మాట్లాడుకుంటే వినిపించి వుంటుంది." నీరజ అటు తిరిగి పడుకుంటూ అంది.

సరోజ నమ్మలేదు. తల్లి ఏదో దాస్తున్నదని గ్రహించింది. అదేమిటని అడగలేదు. నమ్మినట్లుగా "ఊఁ" అని వూరుకుంది.

మరో పది నిమిషాలలో పార్వతమ్మ లేచింది.

నీరజ లేచి కాఫీ, టిఫెన్ చేయటానికి వంటింట్లోకి వెళ్ళింది.

సరోజకు ఏదో అనుమానం వచ్చిందని నీరజ, తల్లి ఏదో దాస్తున్నదనే అనుమానంతో సరోజ సరీగా మాట్లాడలేకపోతున్నారు ఒకరితో ఒకరు.

ఏ అనుమానంలేని పార్వతమ్మ గలగల మాట్లాడుతూనే వుంది.

సాయంత్రం నాలుగు గంటలయింది. బలరాంకి కాఫీ యివ్వటం కుదరలేదు నీరజకు.

ఎప్పుడూ రాత్రి పదకొండు గంటలకి వచ్చే రామ్మూర్తి నాలుగున్నర ట్రైన్‌కి వచ్చాడు.

"అమ్మాయి వచ్చినట్లు దివ్యదృష్టితో చూచావేమిటి

తొందరగా వచ్చారు!" అంది నీరజ, బలరాంకోసం వుంచిన కాఫీ భర్తకు యిస్తూ.

"బండారుపల్లిలో ఎస్. యమ్., ఏ. ఎస్. యమ్. ఒకే సారి సిక్కు చేశారు. అక్కడికి వేశారు. రాత్రి ఎనిమిది గంటల ట్రెన్‌కి వెళ్లాలి. వారందాకా రాను." రామ్మూర్తి ఖాళీచేసిన కాఫీకప్పు కిందపెడుతూ చెప్పాడు.

"బండారుపల్లి మావూరి ప్రక్కస్టేషనే కదా, భోజనానికి వచ్చి పోతుండవచ్చు అన్నగారూ!" పార్వతమ్మ అంది.

"అవును నాన్నగారూ! రోజూ భోంచేసి డ్యూటీకి వెళుతుండవచ్చు." అంది వెంటనే సరోజ.

"వీలయితే అలాగే వస్తాను. ఇద్దరి డ్యూటీ నే ఒక్కడినే చేయాలి. బట్టలు, కావలసిన సామాను తీసుకెళదామని, యీ సంగతి నీరజకు చెపుదామని వచ్చాను." రామ్మూర్తి అంటూ నీరజవైపు చూచాడు. వెంటనే నీరజకు భయమని ఒంటరిగా వుండలేదని గుర్తొచ్చి "పోనీ సరోజా! ఈ వారంరోజులు అమ్మకి తోడుండరాదూ? వచ్చినదానివి ఎలాగూ వచ్చావు. రాత్రిపూట ఒంటరిగా పడుకోటం మీ అమ్మకు భయుంకూడాను," అన్నాడు రామ్మూర్తి.

సరోజ అలాగే అనేలోపల నీరజ అంది.

"నాకేం భయమండీ? తలుపులేసుకుని పడుకుంటాను. కావాలంటే మీనాక్షి చెల్లెలు రాజ్యాని తోడుతెచ్చుకుని రాత్రిళ్ళు పడుకుంటాను. భయము, పిరికి అంటూ మాటకు ముందు నన్ను ఎగతాళి చేయకండి." అక్కడే నుంచుంటే యింకేమి మాటలు వినవలసివస్తుందో అని,

నీరజ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

తల్లికి తనుండటం ఇష్టంలేదని పూర్తిగా నిర్ధారణ అయింది సరోజకు.

రాత్రి ఎనిమిది అయింది.

రామ్మూర్తి కావాల్సిన సామాను తీసుకొని ట్రైన్‌కి వెళ్ళిపొయ్యాడు.

భోజనాలు కానిచ్చుకొని పార్వతమ్మ, నీరజ, సరోజ రాత్రి పదిగంటలదాకా లోకాభిరామాయణం మాట్లాడుకొని పడుకున్నారు.

పడుకుంటూనే పార్వతమ్మ గుర్రుపెట్టటం మొదలు పెట్టింది.

సరోజ పుస్తకం చదువుతూ పడుకుంది.

సరోజ నిద్రపోయే సూచనలు కనపడకపోవటంతో "పడుకోరాదుటే సరూ! పదకొండు కావస్తున్నది," అంది నీరజ.

తను నిద్రపోవటంకోసం ఎదురుచూస్తున్నది తల్లి అని గ్రహించగానే సరోజ చదువుతున్న పుస్తకం మూసేసి "నిద్రొస్తున్నది" అంటూ ఆవులించి పెద్దలైటు ఆర్పేసి పడుకుంది.

పదినిమిషాలు ఆగి "సరూ! సరూ!" అంటూ పిలిచింది నీరజ.

సరోజ పలకలేదు.

మరోసారి గట్టిగా పిలిచింది నీరజ.

ఈతఫా కూడా పలకలేదు సరోజ.

సరోజ నిద్ర పోతుందని గ్రహించుకుని చప్పుడు చేయకుండా లేచింది నీరజ. చిన్నగా అడుగులేస్తూ గది

బైటకు వచ్చి గది తలుపులు దగ్గరగా లాగింది.

నీరజ బైటకు వెళ్ళంగానే సరోజ తల పైకెత్తి చూచి పెదవి మునిపంటితో కొరుకుతూ ఆలోచిస్తూ తలుపుల వైపు కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయింది.

పది నిమిషాల తరువాత మెల్లిగా లేచి తలుపు వద్దకు వచ్చింది సరోజ.

పాత సామానుల గది తలుపులకేసిన తాళం తీసింది నీరజ.

బలరాం బైటకు వచ్చాడు.

"జ్వరం తగ్గిందా?" నీరజ ఆత్రుతగా అడిగింది.

"నీ చేతి మాత్ర బాగా పనిచేసింది. పూర్తిగా జ్వరం తగ్గింది. ఆకలి దహించుకుపోతున్నది." బలరాం నవ్వుతూ చెప్పాడు.

నీరజ నానురొట్టె, పాలు తెచ్చి యిచ్చింది.

రొట్టె పాలల్లో ముంచుకుతింటూ బలరాం అన్నాడు.

"మీ అమ్మాయి చాలా అందంగా వుంటుంది."

"నీరజ ఉలిక్కిపడింది. "ఎలా చూచావ్ సరోజను?" అంది.

"తలుపు పైవేపున కన్నం వుంది చూడు దానిలోంచి చూచాను. చెక్క పెట్టెమీద నిలబడి కంతలోంచి చూస్తే బైట అంతా కనపడుతుంది," బలరాం చెప్పాడు.

"మీ అమ్మాయిది నీ పోలిక. చాలా అందగత్తెల్లో ఒకటిగా పోల్చవచ్చు," తిరిగి బలరాం అన్నాడు.

నీరజ కోపంగా చూసింది.

"మీ అమ్మాయి అందంగా వుందంటే కోపమొచ్చి నట్లుంది? ఉన్నమాట మొహాన అనటం నా అలవాటు తప్పా?"

"నువ్వు చేసేది ఏదీ తప్పులేదు. నే నీకోసం ఇంతగా పాకులాడటం, కంటి రెప్పలా కాపాడటం నాదీ తప్పు. నా ప్రాణం తీస్తున్నావు చాలు. మా అమ్మాయి గురించి మాట్లాడి పూర్తి ప్రాణం తీయకు," కఠినంగా అంది నీరజ.

బలరాం "అబ్బో" అన్నట్లు భుజాలు ఎగరేశాడు.

"ఉదయమే మీ వాళ్ళు వెళ్ళటం ఖాయమేగా?" పాలు త్రాగటం పూర్తి చేసి బలరాం అడిగాడు.

"దైవం నా పట్ల వున్నాడు. ఉదయం ఆరున్నర బండికి వెళతారు."

"గదిలో దాక్కో లేక చచ్చిపోతున్నాను."

"నిన్ను దాయటం, నీకు కావలసినవి అందించటానికి నరకయాతన అనుభవిస్తున్నాను. నా స్థానంలో నీవు వుంటే తెలిసేది."

"నిజమే." వెంటనే ఒప్పుకున్నాడు బలరాం.

"ఏమికావాలో ఇప్పుడే చెప్పు. ఉదయం మా వాళ్ళు వెళ్ళింతరువాతే మళ్ళీ నీ సంగతి చూడటం," అంది నీరజ.

కావలసినవి చెప్పాడు బలరాం.

తీసుకొచ్చి యిచ్చింది నీరజ.

"ఎప్పటికి తెల్లవారుతుందా అని ఎదురుచూస్తూ వుంటాను." గదిలోకి వెళుతూ అన్నాడు బలరాం.

"నీకన్నా నాకు ఆతృతగా వుంది. మావాళ్ళు వెళ్ళిందాకా మనసు మనసులో వుండదు. కంటిమీద నిద్ర వుండదు" అంది నీరజ.

బలరాం గదిలోకి వెళ్ళింతరువాత తలుపులువేసి తాళం

బిగించింది. పెద్ద భారం దిగినట్లు నిట్టూర్పు విడిచి బెడ్ రూమ్ వైపు నడిచింది నీరజ.

తల్లి గదిలోకివచ్చి పడుకుంటుందని గ్రహించిన సరోజ తలుపుచాటునుంచి మెల్లిగా తప్పుకుని తన మంచంమీద కెళ్ళి పడుకుంది.

నీరజ గదిలోకి వచ్చి సరోజ వైపు చూసింది.

గాఢ నిద్రలోవున్న సరోజను చూచి తృప్తిపడి, తన మంచంమీద పడుకుంది నీరజ.

మరి కాసేపటికి నిద్రపోయింది నీరజ.

ఆ రాత్రంతా నిద్రపోలేదు సరోజ, తల్లి గురించి ఆలోచిస్తూ.

# 5

"ఇవాల్టికి సరిగ్గా అయిదు రోజులయింది నేనొచ్చి." బలరాం డ్రస్ చేసుకుంటూ అన్నాడు.

"అవును. సరిగ్గా అయిదు రోజులు," అంది నీరజ.

"ఏ స్త్రీ చేయని త్యాగం చేశావు నీవు. బ్రతికున్నంత కాలం నీ మేలు మరచిపోను. మరోసారి నా వల్ల ఇబ్బంది కలిగించను."

బలరాం వెళ్ళిపోవటానికి మారువేషం వేసుకున్నాడు. నీరజమీద సోదరి ప్రేమ కలిగింది. ఒకటికి పదిసార్లు నీరజను పొగిడాడు. కృతజ్ఞత చెప్పుకుంటున్నాడు.

బలరాం మాటల్లో సంస్కారముంది. ఒంటరిగా వున్నా తన జోలికి రాలేదు. పిచ్చిగా ఒక్కమాట మాట్లాడలేదు. ఇన్ని హత్యలుచేసి హంతకుడు ఎందుకు కావలసివచ్చిందో? బలరాంని చూస్తూ ఆలోచిస్తున్నది నీరజ.

"పోలీసులు చెప్పటం...పన్నెండు హత్యలు చేసి తప్పిం..."

"పోలీసులు చెప్పింది నిజమే. నా అతి మంచితనమే నేను హంతకుడిగా మారటానికి కారణం. నా కథ చెబితే ఓ నవల రాయొచ్చు. ఒకటి మటుకు నిజం. నా జోలికి వచ్చినవారి ప్రాణం - చీమని చంపినంత తేలికగా తీసేస్తాను. సాయంచేసిన వారిని దైవంలా నిత్యం తలుచుకుంటూ నమస్కారం పెట్టుకుంటాను. పదిహేను మంది నాకు ద్రోహం చేశారు. పన్నెండు మందిని పరలోకానికి పంపాను. ఇంకా ముగ్గురు వున్నారు. వాళ్ళనూ సఫా చేసి, నా అంతట నేనే పోలీసులకు లొంగిపోతాను."

బలరాం చెపుతూండగానే బయటనుంచి 'పోస్ట్' అన్న కేక వినపడింది.

నీరజ వెళ్ళి కవరు తీసుకుని వచ్చింది. కవరు ఓపెన్ చేయగానే అది సరోజ రాసినట్లు గ్రహించింది. ఆత్రుతగా చదివింది.

"అమ్మా!

అమ్మా అని పిలవటానికి నోరు రావటంలేదు. నన్ను కన్నందుకు తప్పదు నిన్ను అమ్మా అని పిలవటం. అసలు సంగతి ఆ రోజు నిన్ను చూడటానికి రావటం నా ఖర్మ. నాతో మా అత్తగారు రావటం మరింత ఖర్మ. అత్తగారు నా పక్కన లేకపోతే అప్పుడే అడిగేదాన్ని. నేను వచ్చినప్పటినుంచి నీ ప్రవర్తన విచిత్రంగా వుండటం గమనించాగాని, నీవు ఇంత పతనానికి దిగజారుతావనుకోలేదమ్మా!

ఆ రోజు రాత్రి కళ్ళారా చూశాను. చెవులారా విన్నాను. అంతా అర్థమైపోయింది. ఈ కాలకూట విషం నా కడుపులోనే వుంచుకుంటాను. నన్ను చూడటానికి ఎప్పుడూ ప్రయత్నించవద్దు. ఈ రోజునుంచి అమ్మ

లేదనే అనుకుంటాను. నాన్నగారిని మోసం చేయడం బదులు కాస్త విషం తాగకూడదా? ఇన్నేళ్ళొచ్చి ఎందుకమ్మా ఇంత నీచానికి దిగావు? అసలు నన్నెందుకన్నావు? యీ బాధ ఒకరికి చెప్పుకోలేనిది. ఏం చేయలేక నీకో ఉత్తరం రాస్తున్నాను. నిన్ను నే మరిచిపోలేను. నన్ను మరిచిపో. నీలాంటి వారికి అది చాలా తేలిక.

ఇట్లు
సరోజ."

"భగవంతుడా! నేనేం పాపం చేశానయ్యా?" పిచ్చిగా తలపై కొట్టుకుంటూ అంది నీరజ.

"ఏముందా లెటర్‌లో?" బలరాం ఆతృతగా అడిగాడు.

"ఏముందా? నా పరువు, మర్యాద, శీలం అన్నీ పోయే విషయం వుంది. పాముకి పాలుపోసి పెంచితే కాటు వేయక మానదు. హంతకుడిని కాపాడబోయి అపద పాలయినాను," ఉత్తరం విసిరికొడుతూ అంది.

బలరాం ఉత్తరం తీసుకుని చదివాడు. తనకు ఆశ్రయమిచ్చిన దేవతకి ఎంత అపవాదు వచ్చిందో తెలుసుకోగానే అతని ముఖం వివర్ణమయింది.

నీరజ చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

బలరాం హృదయం మూలిగింది, కనపడని గాయం తగిలి.

"ఇలా అవుతుందని వూహించలేదు. నేనెలాగూ వెళ్ళిపోతున్నాను. వివరంగా మీ అమ్మాయికి ఉత్తరం రాయి నీ మంచితనమే నీకు రక్ష."

నీరజ మాట్లాడలేదు. ఇంకా ఏడుస్తూనే వుంది.

నీరజను వూరడించినంత మాత్రాన జరిగింది పరిష్కారం కాదు. అందుకే బలరాం శలవు తీసుకుని మారువేషంతో ఆ ఇంట్లోంచి బయటపడ్డాడు.

నీరజ ఏడ్చిఏడ్చి అలిసిపోయి, చాలాసేపటికి ఓ నిర్ణయాని కొచ్చి కలం, కాగితం తీసుకుంది.

"ప్రియమైన సరోజా,

అమ్మ రాసిందని కోపగించుకోక, ఉత్తరం పొంతం చదివి చించేయి. నేనున్న పరిస్థితులలో నే చేసింది నేరం కాదు. నీవు చూచింది, విన్నది తప్పుకాదు. కాని..సరూ! ఒక్కొక్కసారి కళ్ళారా చూచింది, చెవులారా వినిందికూడా నిజంకావు. మన కళ్ళు, చెవులే మనల్ని మోసం చేస్తాయి.

నీవు మనింటి కొచ్చిన క్రితంరాత్రి బలరాం అనే పన్నెండుమందిని హత్యచేసిన హంతకుడు పోలీసులనుండి తప్పించుకు పారిపోతూ, రాత్రి పదిగంటల సమయంలో మనింట్లో అడుగుపెట్టాడు. మీ నాన్నగారు లేరు. నేనెంత పిరికిదాన్నో తెలుసుకదా? పిస్టల్‌తో బెదిరించి తన గురించి ఆచూకీ చెప్పనని అనిపించి పిల్లలపై ప్రమాణం చేయించాడు. తుపాకీ గుండు దెబ్బలు తగలటంవల్ల కదలలేక మనింట్లోనే వున్నాడు. ఆ రాత్రికి మీ నాన్నగారు వచ్చారు, వెళ్ళారు. మర్నాడు అతనికోసం బజారు వెళ్ళి కావలసినవి తెచ్చాను. నీవు మీ అత్తగారు వచ్చారు వెళ్ళారు. జ్వరంతో అతను ఇంట్లోంచి వెళ్ళలేదు. యీ రోజు వెళ్ళిపోయాడు. నీ ఉత్తరం అందే సమయానికి అతను ఇక్కడే వున్నాడు. ఉత్తరం చదివి విచారించి తన దోవన తాను వెళ్ళాడు. అతను హంతకుడు అయినా,

నా జోలికి రాలేదు. ఓ తమ్ముడిలా వుండి వెళ్ళాడు.

సరూ! ఇదమ్మా జరిగింది. అతన్ని గురించి పోలీసులకు ఆచూకీ తెలిపితే మన కుటుంబాన్ని సర్వనాశనం చేస్తానన్నాడు. నా స్థితిలో ఎవరుంటేమటుకు ఏమి చేయగలరు? అతని పేరు బలరాం, వీపుమీద అరచేయి వెడల్పు అంగుళం ఎత్తు కంతి వుంటుంది. ఇది నీకుమాత్రమే తెల్పుతున్నాను. నీవు అపార్థం చేసుకున్నంత మాత్రాన బాధ పడను. యీ ఉత్తరం చదివి నామీద నమ్మకం వుంటే, అమ్మా పొరపాటుపడ్డాను నీ విషయంలో అని రెండు ముక్కల లెటర్ రాయి. లెటర్ చంద్రశేఖరానికి చూపించకు. నీ వద్దనుంచి లెటర్ రాకపోతే అమ్మ ఎప్పటికీ నీకు కనిపించదు. నా శవం చూద్దువుగాని, నాపై నమ్మకం లేకపోతే శవాన్ని చూడటానికి కూడా రావద్దు.

ఇట్లు
నీరజ."

నీరజ తను రాసింది ఒకటికి రెండుసార్లు చదివి తృప్తి పడి కవరులో పెట్టి అప్పటికప్పుడు పోస్ట్ చేసింది.

పిచ్చిదానిలా జరిగింది మననం చేసుకుంటూ కూర్చుంది నీరజ.

*          *          *

'సరోజకు ఉత్తరం రాసి ఇవాల్టికి నాలుగు రోజులు' అనుకుంది నీరజ.

"ఉత్తరం అందిన రోజే రిప్లయి రాయటానికి వీలయి వుండకపోవచ్చు, నిన్న రాస్తే యీ రోజు అందాలి. యీ రోజు తప్పకుండా వస్తుంది వుత్తరం. పోస్ట్ వచ్చే వేళయింది కూడాను."

నీరజ వీధి గుమ్మంలో నుంచొని పోస్ట్ బంట్రోతుకోసం చూస్తుంటే రిక్షాలోంచి రామ్మూర్తి దిగాడు.

రామ్మూర్తి ముఖం దిగాలుగా వుంది.

నీరజ ఎడికన్ను అదిరింది.

"నీరజా తొందరగా బైలుదేరు సరోజవద్దకు వెళ్లాలి" అన్నాడు రామ్మూర్తి జీరబోయిన స్వరంతో.

"సరోజకు ఏమయిందండీ?" కీడు శంకిస్తూ అడిగింది నీరజ.

"సరోజకు ఏం కాలేదు. ముందు తలుపు తాళంవెయ్యి అర్జంటుగా వెళ్ళాలి," తొందరచేశాడు రామ్మూర్తి.

నీరజ కట్టుగుడ్డలతో తలుపుకి తాళంవేసి, రామ్మూర్తి వెంట బయలుదేరింది.

నీరజ, రామ్మూర్తి అటు వెళ్ళంగానే పోస్ట్ బంట్రోతు కవరు నీరజపేర వచ్చింది కిటికీలోంచి లోపలికిగిరవాటేసి వెళ్ళిపోయాడు.

"చెప్పండి ఏం జరిగిందో అదెంత ఘోరమైన విషయమైనా సరే."

కళ్ళ నీళ్ళు కారుస్తుంటే నీరజను చూడలేక నిజం చెప్పాడు రామ్మూర్తి.

"బలరాం అనే హంతకుడి కోసం పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారు. అతను నిమిషానికో వేషంలో పోలీసుల కళ్ళుగప్పి తిరుగుతున్నాడు. అతనెలా వుంటాడో సరిగ్గా ఎవరికీ తెలియదు. హంతకుడి వీపుమీద కంతి వుందిట. అదొక్కటే బాగా తెలిసిన గుర్తు. రాత్రి చంద్రశేఖరం మారువేషంతోవున్న బలరాంని గుర్తించి వెంటపడ్డాడు. బలరాం, చంద్రశేఖరాన్ని తప్పించుకోటానికి పిస్టల్తో

కాళ్ళపై కాల్చి పారిపోయ్యాడు. మన చంద్రశేఖరంకి బలమైన గాయాలు తగిలాయి,'' రామ్మూర్తి మెల్లిగా చెప్పాడు.

''చంద్రశేఖరానికి అపాయం లేదుకదా? చెప్పండి. నిజం చెప్పండి'' ఆవేశంగా అరుస్తున్నట్లే అడిగింది నీరజ.

''లేదు నీరజా! చంద్రశేఖరానికి ప్రమాదం ఏమీ లేదని డాక్టర్లు చెప్పారు. కాలు మీద బలమైన గాయం అయింది. అదే అందరికీ ఆశ్చర్యంగా ఉంది. ఆ బలరాం పచ్చి నెత్తురు త్రాగే కసాయివాడు, తనకు అపకారం తలపెట్టిన వారిని ఎవరినీ ప్రాణాలతో వుంచడు. అటువంటిది చంద్రశేఖరం అనేక రౌండ్లు కాల్చి అతడిని గాయపరచినా, అతడు మాత్రం చంద్రశేఖరానికి ప్రాణహాని తలపెట్టకుండా కాళ్ళపై కాల్చి గాయాలతో పారిపోయాడు. ఏమైనా మన అమ్మాయి అదృష్టవంతురాలు'' అని చెప్పాడు రామ్మూర్తి.

నీరజ గుండెలు కుదుట బడ్డాయి. బలరాం, చంద్రశేఖరం ప్రాణాలు తీయకపోవటానికి కారణం తనకు తెలుసు. అతడు హంతకుడే అయినా, అతడిలోని నిజాయితీకి, సంస్కారానికి మనసులోనే ధన్యవాదాలు అర్పించింది నీరజ.

—: ఐ పో యిం ది :—

# ఆత్మహత్యకు అర్హతుండాలి!!

సుజనశ్రీ

సరోజ కళ్ళు తెరిచింది. అసహనంగా కదలబోయింది. ఆమె కాళ్లూ, చేతులూ ఆమె స్వాధీనం తప్పిపోయినట్టుగా అనిపించింది. తలమీద సమ్మెట పోట్లు కొట్టుతున్నంతగా బాధ కలిగింది.

"అమ్మా!" అంటూ మూలిగింది.

సిస్టర్ వచ్చి సీసాలోని మందుని ఔన్సుగ్లాసులోకి వంచింది. సరోజ మీదకు వంగి, "నోరు తెరువమ్మా! మందు తాగుదువుగాని!" అంది అనునయంగా.

చేదు మందు గొంతులోకి జారింది. సరోజ కళ్లు తెరిచి చుట్టూ పరికించి చూసింది, తల తిప్పకుండానే!

చుట్టూ తెల్లని గోడలూ, తెల్లని బెడ్స్‌మీద రోగులూ

మందుల వాసనా. తను హాస్పిటల్లో ఉన్నానని తెలుసు కుంది.

"సిస్టర్! నేను చచ్చిపోలేదా?" అని అడిగింది, సరోజ.

"ప్రమాదం తప్పింది నీకు! ఇక భయంలేదు!" సిస్టర్ బదులు చెప్పింది.

"పోనీ నేను చచ్చిపోవటానికి ఇంకా ఎంత సేపు పడు తుందో చెప్పగలవా సిస్టర్!"

సిస్టర్ చిఱునవ్వు నవ్వింది. "డాక్టర్ రాజారావుగారి చేతుల్లో పడ్డ పేషంట్, చావాలన్నా చావదు అమ్మాయ్!"

సరోజ గట్టిగా కళ్ళు మూసుకుంది. తను యమ లోకంలో, చిత్రగుప్తుడి ముందు తన పాపపుణ్యాల లిస్టుని వింటూ ఉండటాన్ని ఊహించుకున్న తనకు జీవితంలో తీవ్రమైన నిరుత్సాహం గురైయింది.

అడుగడుగునా తను చావటానికి వీల్లేకుండా, ఏవేవో ఆటంకాలు కలుగుతున్నయ్. ఇన్ని అవాంతరాలతో తను ఇంకా జీవించి ఏం సాధించాలనో!

పట్టుమని పంథొమ్మిదయినా నిండకముందే, తను జీవి తంలో చిత్తుగా ఓడిపోయానని తెలుసుకున్నాక, ఇక తన జీవితానికి సాఫల్యం లేదని గ్రహించింది.

హాల్లో డాక్టర్ రాజారావు కంఠం వినిపించింది, సరోజకు.

అందరి బెడ్స్ దగ్గరకు వెళ్ళి, సిస్టర్ని పేషెంటులో మార్పుల గురించి అడుగుతున్నాడు. ఆ తర్వాత పేషెంటు

చెప్పేది వింటున్నాడు. అవసరమైతే ప్రిస్క్రిప్షన్ రాసిచ్చి, తర్వాత బెడ్ దగ్గరకు నడుస్తున్నాడు.

"ఎలా ఉంది ఈ అమ్మాయికి?" సరోజ బెడ్ దగ్గరికి వచ్చిన రాజారావు అడిగాడు.

"ఇప్పుడే తెలివి వచ్చింది డాక్టర్! మిక్చర్ కలిపి ఇచ్చాను. చావు గురించి మాట్లాడుతోంది!" అంది సిస్టర్.

"పాపం! ఒకప్పుడు బాగా బ్రతికిన యువతి. అందరూ ఉండి కూడ, ఏకాకిగా మిగిలిపోయింది. జాగ్రత్తగా కనిపెట్టి వుండు!"

"యస్ డాక్టర్!"

సరోజకు దుఃఖం పెల్లుబికి వచ్చింది. కండ్లలో నీరు నిలిచింది. ఏడ్పుని ఆపుకునే యత్నంలో పెదవులు వణికినయ్.

ఆమె మనసు గతంలోకి పరుగెత్తింది. ఆరోజులు ఎంత హాయి అయినవి? ఒక్కో సంవత్సరం గడుస్తున్నకొద్ది, తన కష్టాలు కూడా క్రమేపీ ఎక్కువైనయ్!

తల్లి బ్రతికున్నంతకాలం తనకు ఏ లోటూ రాకుండా జరిగిపోయింది తన జీవితం. ఆమె పోతూ తన జీవితంలో వెలుగుని వెంటపెట్టుకుని మరీ పోయింది.

## 2

ఆ రోజు రాఘవయ్య హడావిడిగా ఉన్నాడు. కూతుర్ని పిలిచి "అమ్మాయ్! ఈవేళ అవధాన్లుగారు పెళ్ళి సంబంధం మాట్లాడటానికి వస్తారు. కాస్త కాఫీ, టిఫిన్ చేసి రెడీగా ఉంచు!" అని చెప్పాడు, అదోలా బిడియపడుతూ.

సరోజ హృదయం ఉరకలు వేసింది. అవధాన్లుగారు

తమ ఇంటికి వస్తున్నాడంటే, ఏదో పెళ్ళి సంబంధం మాట్లాడడానికే! ఎవరికి పెళ్ళి? ఇంకెవరు? తనకే గదా!

ఆ త్తగారింట్లో తన వంటకాలు రుచిచూసి, వారంతా తనను ఎంతగా మెచ్చుకుంటారో ఊహించుకుంటూ, స్వీట్ మైసూర్ పాక్ తయారుచేసింది. వరాలయ్య కొట్టు నుంచి జీడిపప్పులు తెప్పించింది. జీడిపప్పు పకోడీవండింది. గేదెపాలు, చిక్కని పాలతో అమృతంలాంటి కాఫీ పెట్టింది.

టిఫిన్ తింటున్నంతసేపూ అవధాన్లుగారు సరోజ వంటనే మెచ్చుకున్నాడు. వంటగది తలుపుకు ఆనుకుని నిలబడి, హాల్లో కూర్చున్నవారి మాటలు వింటున్న సరోజ పొంగిపోయింది.

అంతలోనే, 'ఈ అవధాన్లూ! ఎంతసేపూ తిండిగురించే కానీ, సంబంధం గురించి మాట్లాడదేమిటూ?' అనుకుంది సరోజ.

రాఘవయ్య నోటంట గూడ అదే ప్రశ్న వచ్చింది. "అబ్బ! ఆ వంటకాల వర్ణన ఆపవయ్యా శాస్త్రిలూ! ఇంతకీ సంబంధం గురించి చెప్పరేం?" చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ అన్నాడు.

"వస్తున్నా! వస్తున్నా! సంబంధం గురించి అంతా లోగదే చెప్పాను గదా రాఘవయ్యా! ఇప్పుడు మళ్ళీ కొత్తగా చెప్పేందుకే ముంటుంది? అమ్మాయి పేరు సరస్వతి. వయస్సు పద్దెనిమిది వుంటయ్. పదో తరగతి వరకూ చదువుకుందట. సంగీతం వచ్చును. అంటే హార్మణీ పెట్టె వాయించడం అన్నమాట! పోతే వాళ్ళు కట్న

కానుకలేవీ ఇచ్చుకునే తాహతు లేనివాళ్ళు.''

''ఆఁ! ఇప్పుడవన్నీ ఎవరడిగారు? కావాలంటే పెళ్ళి ఖర్చు గూడ మనమే భరాయిద్దామని చెప్పకపోయావా?'' రాఘవయ్య స్వరం తగ్గించి మాట్లాడ్డం సరోజకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

అంతేగాదు! తన కెవరో వరుడ్ని వెదికి తెచ్చి వుంటాడని తను సంబరాలు పడుతుంటే, ఈఅవధాన్లు అమ్మాయి పుట్టుపూర్వోత్తరాలు వర్ణిస్తాడేమిటి? కొంపతీసి తండ్రి రెండో పెళ్ళికి తలపెట్టలేదుకదా! తల్లిపోయి ఆర్నెల్లు కాడా కాలేదు. సరోజ ఆకులా వణికిపోయింది.

కన్నకూతురికి వివాహం చెయ్యవలసిన తరుణంలో, ఆమె సంగతి పట్టించుకోకపోగా, కూతురి వయస్సు గల అమ్మాయిని రెండో మనువాడ బోతున్నాడా?

అవధాన్లు లగ్నంకూడ స్థిరపరచాడు. మరో మూడు రోజుల్లో తాంబూలాలు లాంఛనంగా పుచ్చుకునేందుకు ముహూర్తం ఎన్నిక చేశాడు.

''తర్వాత, మన అమ్మాయికి గూడ ఏదయినా మంచి సంబంధం చూడకపోయారా?'' అదేదో మాటవరసకు రాఘవయ్య అడుగుతున్నట్టుగా తోచింది సరోజకు.

''చూస్తున్నా! చూస్తునా! ఏదీ, మన తాహతుకుతగ్గ సంబంధం దొరకద్దూ?'' అవధాని ఆ విషయాన్ని దాటేయనే వేశాడు.

సరోజలో ఉత్సాహం నీరు కారిపోయింది. తండ్రి వెళ్ళిపోయిన తర్వాత, తల్లి ఫొటో దగ్గరకు వెళ్ళి, చీర చెరగు నోటికడ్డం పెట్టుకుని ఏడ్చింది.

రాఘవయ్యా పెళ్ళి తతంగం టూకీగా జరిపేసుకున్నాడు. ఆర్భాటంగా పెళ్ళి జరిపిస్తే, ఆ విషయం అందరి నోటా నానుతుందనీ, ముసలాడికి పెళ్ళంటే ఎంత సంబరం సుమా, అని తనను ఆడిపోసుకుంటారనీ అతని బిడియం.

రాఘవయ్యా లజ్జను కనిపెట్టి, పెళ్ళికూతురి తండ్రి మరీ అగడం చేసి, అనుకున్న దానికన్న ఎక్కువే డబ్బు గుంజాడు. అయినా రాఘవయ్యా మాత్రం బాధపడలేదు. ఈ కార్యం సక్రమంగా నెరవేరితే చాలనే ఆతృతగా ఉన్నాడు.

రాఘవయ్యా కూతుర్ని దగ్గరకు పిలిచాడు ఒకరోజున. ఆ పిలుపులో ఎన్నడూ లేని లాలన తోచింది సరోజకు.

"చూడమ్మా! మీ పిన్నికి కొత్తగా ఉంటుంది ఇక్కడ! అందుకని కొన్నాళ్ళపాటు నీవే ఇంటి పనులన్నీ యథావిధిగా చేసుకువెళ్ళు. కొంత అలవాటయాక, వంట ఇంటి బాధ్యత మీ పిన్నికి అప్పగించవచ్చు!" అన్నాడు రాఘవయ్యా నసుగుతూ. సరోజకు దుఃఖం పొంగుకొచ్చింది. ఆ రోజంతా తనివితీరా ఏడ్చింది.

సరస్వతి కదిలితే కందిపోతుందేమో నన్నట్టుగా రాఘవయ్యా ఆమె చెంతనే అంటిపెట్టుకుని ఉండి, ఆమె అవసరాలన్నీ చూస్తూన్నాడు.

మేడమీద గదిలో సరస్వతితో పగలూ, రాత్రీ అనే భేదం లేకుండా గడుపుతున్నాడు.

తండ్రి తలుపు తెరిచి కేకపెడితే, సరోజ టిఫినూ, కాఫీ పైకి తీసుకెళ్ళేది.

ఇలా రెండునెలలు గడిచినయ్. అయినా సరోజ, సర

స్వతి ఇద్దరూ ఇంకా అపరిచితులుగానే ఉండిపోయారు. తన తల్లి స్థానాన్ని ఆక్రమించటానికి వచ్చిన సరస్వతిని సరోజ అక్కసుతో చూస్తే, అందం, ప్రాయం ఉన్న ఈ యువతి తనలాగ కాకుండా, యవ్వనం ఉన్న యువకుడ్ని పెళ్ళాడుతుంది గదా అనే అసూయగా చూసేది సరస్వతి.

నాట్ల తరుణం వచ్చింది. పొలాలకు నీరు పెట్టి తడి చెయ్యటం, దున్నటం ఇత్యాది పనులతో రాఘవయ్యకు ఇంటిపట్టున ఉండేందుకు వీల్లేకుండా అయిపోయింది. వేళ కిన్ని మెతుకులు కొరికి కర్ర పుచ్చుకుని పొలానికి వెళ్ళడం, లేదా ఆ భోజనంకూడా పాలేరుని పంపి పొలానికే తెప్పించుకోవడమో చేసేవాడు.

సరస్వతి గదిలో బెడ్ మీదనుంచే కాఫీకోసం కేక పెట్టింది.

ఆదరాబాదరాగా సరోజ కాఫీ పుచ్చుకుని పైకి వెళ్ళింది.

ఆమెను చూస్తూనే సరస్వతి రుసరుసలాడింది. "ఏమ్మా? మూడవుతున్నా కాఫీ తేవటం తెలీదా? లేక పోతే మీ నాన్న ఉంటేనేగానీ కాఫీ ఇవ్వరా ఈ ఇంట్లో!"

సరోజకు అరికాలిమంట నెత్తికెక్కింది. ఏమిటీవిడ దర్బాయింపు? తను నియమించుకున్న పనిమనిషి అనుకుందా ఏం? అయినా ఆడదై పుట్టాక, వంటగదిలోకి వచ్చి తాగచ్చు గదా! మహారాణీలాగ బెడ్ రూమ్‌లోంచి అరవకపోతే!

ఇది మొదటి సంఘటన కనుక, తనే సరిపెట్టుకోవటానికి యత్నించింది, సరోజ.

"నీవు ఇంకా నిద్ర లేచావో, లేదో అని తేలేదు పిన్నీ!" అంది సరోజ.

కాఫీ సిప్ చేస్తున్నదల్లా సరస్వతి ఆగిపోయింది.

"నీ వయసెంత?" అని అడిగింది.

"పద్దెనిమిది!" సరోజ బదులిచ్చింది, ఆశ్చర్యంగా చూస్తూ.

"నా వయసెంతో తెలుసా?"

"తెలీదు. నీవు చెబితే గదా తెలిసేది నాకు పిన్నీ?"

"అదుగో, ఆ మాటే అనొద్దంటున్నాను. నీ వయసు పద్దెనిమిది. నా వయసు పదిహేడు సంవత్సరాలు. అంటే, నేను నీకన్న ఒక ఏడాది చిన్న! నీకు నేను పిన్ని ఎలా అవుతాను?"

అదా ఈమె బాధంతా అని, లోలోపలే నవ్వుకుంది సరోజ.

"మరయితే నిన్నేమని పిలవను?"

"పేరుపెట్టి పిలు! సరస్వతీ అని!"

"నాన్న కోప్పడతారేమో!"

"పిన్నీ, గిన్నీ అంటే, ఎప్పుడో కోప్పడే నాన్న సంగతి కాదు, ఇప్పుడు నేనే నోరు చేసుకోవలసి వస్తుంది. అసలే నా నోరు మంచిది కాదు. కావాలంటే, మా ఊళ్ళో అడుగు చెబుతారు. సరస్వతి అంటే మేముండే చోట మూడువీధులకు హడలే" అంటూ అరగంట లెక్చరిచ్చింది.

కానీ ఆరోజు చీకటి పడేలోపునే మరో అనర్థం జరిగిపోయింది. పొలంలో కలుపు తీయించి, సాయంకాలానికి ఇంటికి తిరిగివస్తున్న రాఘవయ్యను త్రాచుపాము కరిచింది. నోట నురుగులు కక్కుతూ రాఘవయ్య పొలం గట్టుమీదే పడిపోయాడు.

ఎవరో ఆ దారంట పోతూ చూడటం తటస్థించింది. నలుగురూ పోగై ఆయన్ను చేతులమీద ఇంటికి చేర్చారు. పాము మంత్రగాళ్ళకు ఫోను వెళ్ళింది. కానీ ఏం లాభం లేకపోయింది.

ఇంకో గంటకు రాఘవయ్య ఈ లోకంలోంచి శాశ్వతంగా నిష్క్రమించాడు.

సరోజ తండ్రి శవంమీద పడి విలపించింది. తనను కొట్టినా, తిట్టినా అతడు తన కన్న తండ్రి. తల్లి పోయినందుకే ఆమె జీవితం నరకప్రాయంగా తయారయింది. ఇప్పుడు ఆ తండ్రిగూడ దాటిపోతే తన గతి అధోగతే. పగబట్టిన పాములా సరస్వతి తనను కాటేయాలని కనిబెట్టుకుని ఉంది.

పదిరోజులు గడిచినయ్.

పాలేరు నరహరితో ప్రేమకలాపాలు మొదలెట్టింది సరస్వతి. రాత్రింబగళ్ళు వాడితోనే గదిలో వుంటోంది.

రాఘవయ్య చనిపోయాడన్న విచారం వాళ్ళలో ఏ కోశానా లేకపోగా, అతడి మరణం వాళ్ళకి మేలే కలుగచేసినట్లుగా సంతోషంగా గడపసాగారు. ఇల్లూ, పొలం, డబ్బూ, దస్కం అన్నీ సరస్వతి అధీనంలోకి వచ్చాయి. ఆ ఇంటికి క్లియోపాత్రా రాణి అయిపోయింది సరస్వతి.

సరస్వతి స్థానం ఎంత ఉన్నతికి చేరుకుందో, సరోజ గతి అంత అధోగతికి దిగజారింది. ఇంటి చాకిరితోనే సరోజ సతమతమవుతుంటే, పైన సరస్వతి ఏదో వంకన సాధించటం, చేయి చేసుకోవటం పరిపాటి అయిపోయింది.

అన్నం ముందు కూర్చుని అన్నం, కూర కలిపేది సరస్వతి. ఒక ముద్ద నోట్లో పెట్టుకుని "థూ!" అని సరోజ ముఖాన ఊసేది. "నీ వంట వల్ల కాదేగిపోను! ఇదేం మనుషులు తినేదా, లేక పందులకు పెట్టేదా? రోజు రోజుకు ఇలా చేసి చస్తున్నావేం?" అని తిట్టేసేది. లేచి వెళ్ళిపోతూ చేత్తో నెత్తిన రెండు మొట్టేది.

"ఆ ముసలాయనతో బాటు నీవూ ఛస్తే బాగుండి పొయ్యేది!" అనేది.

బస్తీలో ఫారిన్ నైలెక్స్ చీరెలూ, టాయిలెట్ సామాన్లూ కొనేందుకు నరహరి, సరస్వతి ఇద్దరూ బస్తీకి వెళ్ళారు ఆ రోజు.

మేడమీది గది ఊడ్చి శుభ్రం చేసేందుకు సరోజ వెళ్ళింది.

ఇనప్పెట్టె తాళాలు ఇనప్పెట్టెకు వ్రేలాడుతున్నయ్. పాపం, కొత్త జంట, కొత్త సుఖం. తమ హడావిడిలో తాళాలు మరిచిపోయారల్లే ఉందే అనుకుంది సరోజ.

చేతిలోని చీపురు క్రింద పడేసింది. ఇనప్పెట్టె తెరిచి చూసింది. లోపల నోట్ల కట్టలూ, తల్లి నగలూ ఉన్నయ్. వాటిని చూడంగానే సరోజ మనసులో సరికొత్త ఆలోచన మెరిసింది. కొంత డబ్బు తీసుకుని తను ఎటన్నా వెళ్ళిపోతేనో!

ఈ నరకంనుంచి బయటపడవచ్చు ముందు. తనచేతిలో డబ్బు అయిపోయే లోగా ఎక్కడైనా చిన్న ఉద్యోగం సంపాదించుకోలేక పోతుందా తను?

అయితే ఎక్కడకు వెళ్ళాలి? ఎవర్ని సాయం అడగాలి? విజయవాడలో తన తండ్రి స్నేహితుడున్నాడు డాక్టర్ రాజారావు. అతడివద్దకు వెళ్ళి సాయం అడగాలి.

'ఆలస్యం అమృతం విషం' అనుకుంది సరోజ. ఇనప్పెట్టెలోనుంచి మూడువేలు తీసుకొని అప్పటికప్పుడు విజయవాడ రైలెక్కింది.

* * *

"అరెరె! నాన్నగారు పోయారా? ఎంత ఘోరవార్త విన్నాను! ఆయనకు నేను చాల ఋణపడి ఉన్నాను. నా చదువుకు చాలా సహాయం చేశారు. ఎంత పని జరిగింది!" అని రాజారావు నొచ్చుకున్నాడు, సరోజ కథంతా విని.

"మీ కృతజ్ఞతల్ని అందుకోవటానికి ఈ భూమ్మీద మా నాన్నగారు ఎటూ లేరు! ఆయన కుమార్తెను నేను నిస్సహాయురాలినై ఏకాకిగా ఉన్నాను. నాకేదైనా ఆసరా చూపించగలిగితే..."

"ష్యూర్! ష్యూర్! అంతకన్నానా? నేను మీకే గకంగా సాయం చేయగలనో చెప్పండి. డబ్బు కావాలా?"

"డబ్బు కాదండి! మా నాన్న చివరిరోజుల్లో పునర్వివాహం చేసుకున్నారు. తీరా ఆయన పోయాక మా పిన్ని అక్రమపు సంబంధం ఏర్పరచుకుంది. వాళ్ళిద్దరూ ఒకటై నా కా ఇంట్లో ప్రత్యక్ష నరకాన్ని చవి చూపిం

చారు. ఇక అక్కడ బ్రతకలేక పారిపోయి వచ్చాను! నా కాళ్ళమీద నేను నిలబడి జీవించగలిగేందుకు ఎక్కడైనా చిన్న ఉద్యోగం ఇప్పించండి'' అని ప్రాధేయ పూర్వకంగా అడిగింది.

డాక్టర్ రాజారావు తల నిమురుకున్నాడు చేత్తో.

''ఉద్యోగం దొరకటమంటే మాటలు కాదు, అందులోనూ ప్రస్తుతపు రోజుల్లో! నీవు ఎంతవరకు చదివావ్? టైప్ రైటింగ్ లాంటి క్వాలిఫికేషన్లేమైనా వున్నాయా?''

''అబ్బే! అసలు నేను పదోతరగతి వరకూగూడ చదవలేదు! పెద్ద చదువులతో పనిలేని చిన్నఉద్యోగం చూడండి చాలు!''

రాజారావు ఒక్కనిముషం ఆలోచించాడు. ''నీ చదువుకి ఏం ఉద్యోగం దొరుకుతుందబ్బా?'' అన్నాడు నిదానంగా.

''ఎక్కడైనా పెద్ద గుడ్డల షాపులో సేల్స్‌గరల్‌గా దొరికినా చాలు!''

''ఆల్ రైట్! నీవు చెప్పిన ప్రకారమే కానిద్దాం! నాకు తెలిసిన క్లాత్ షాప్ ఓనర్స్‌ని కనుక్కుంటాను. నీకు ఉద్యోగం దొరుకుతుందనే నా ఉద్దేశ్యం. అందాకా నీవు మా ఇంట్లోనే నిరభ్యంతరంగా ఉండచ్చు!'' అంటూ రాజారావు కాలింగ్ బెల్ నొక్కాడు.

సిస్టర్ వచ్చింది.

''డ్రైవర్ని పిలు!''

సిస్టర్ వెళ్ళి డ్రైవర్ని పంపింది.

''చూడు రామయ్యా! ఈ అమ్మాయిని కారులో తీసు

కెళ్ళి మా ఇంటిదగ్గర దిగవిడిచి రా!" అన్నాడు.

"అలాగే సార్!" అంటూ డ్రైవర్ తలూపి బయటకు వెళ్ళాడు.

"ఇంట్లో ఆయా వర్ధనమ్మ ఉంటుంది. నీవు వస్తున్నట్లు ఆమెకు ఫోన్ చేస్తాను. ఇంటికి వెళ్ళి స్నానంచేసి, భోజనంచేసి హాయిగా నిద్రపో! అసలే ప్రయాణపు బడలికలో ఉన్నట్టున్నావ్!"

సరోజ కుర్చీలోంచి లేచింది. డాక్టర్ రాజారావుకి నమస్కారంచేసి రూమ్‌లోంచి బయటకు వచ్చింది. కారులో ఎక్కి కూర్చుంది.

డాక్టర్ రాజారావు రిసీవరెత్తి డయల్ చేశాడు.

"వర్ధనమ్మా! మన ఇంటికి సరోజ అని ఒక అమ్మాయి వస్తోంది. ఆమెకు అన్ని సదుపాయాలు సమకూర్చి, ఆమెకే ఇబ్బంది కలగకుండా చూడు! వాళ్ళ నాన్నవల్ల నేను చాలా సహాయం పొందివున్నాను" అన్నాడు ఫోన్‌లో.

"అలాగే బాబూ!" అంది వర్ధనమ్మ.

వాకిట్లో సరోజకు వర్ధనమ్మ ఎదురొచ్చింది. "రామ్మా రా! నీ గురించి డాక్టర్‌బాబు ఇప్పుడే ఫోన్ చేశారు!" అంది ఆప్యాయతగా.

ఆమె ఆదరానికి ముగ్ధురాలౌతూనే సరోజ, ఆమె ఆతిధ్యాన్ని స్వీకరించింది.

ఉప్మా టిఫిన్ తిని కాఫీ త్రాగింది. వేడినీళ్ళ స్నానం చేసి డ్రెస్ మార్చుకుంది సరోజ.

భోజనం ముందు వర్ధనమ్మ కొసరి కొసరి వడ్డించింది. ఆమె ఆప్యాయత తన తల్లిని గుర్తుకు తెచ్చింది సరోజకు.

హాల్లో గోడకు తగిలించివున్న పెద్ద ఫొటో ఆమె స్సాక్షి రించింది. ఫొటోలోని వ్యక్తి అందంగానూ, ఆకర్షణీయంగానూ వుంది.

సరోజ ఫొటోవంకే తదేకంగా చూడటం గమనించిన వర్ధనమ్మ, "ఆమె డాక్టర్ గారి భార్య!" అంది.

"ఆమె ఎక్కడుంది? ఇంట్లో ఎక్కడా కనుపించలేదే?"

"ఆమె ఏక్సిడెంట్ లో మరణించింది!"

"పాపం! చిన్న వయసులోనే అకాలమృత్యువుకి గురైందన్నమాట! పైగా రాజారావుగారు ఆడవాళ్ళను విరక్తిగా చూడటం గ్రహించాను. అంటే చనిపోయిన భార్య అంటే ఆయనకు ఎంత గౌరవం ఉండివుండాలి? ఆమెను తన హృదయంలోనుంచి తుడిచివేయలేకనే, పునర్వివాహం విషయం ఎత్తలేదల్లే ఉంది!" డాక్టర్ రాజారావు ఆదర్శాన్ని మెచ్చుకుంటూ అంది సరోజ.

వర్ధనమ్మ నిట్టూర్పు విడిచింది. "అదంతా పెద్ద విషాద గాథలే తల్లీ!" అంది వంటింట్లోకి వెళ్ళుతూ.

రాజారావుని పెళ్ళాడిన స్త్రీ ఎంత అదృష్టవంతురాలు? ఈ భూమ్మీదినుంచి వెళ్ళిపోయినా, ఆమెనే తన హృదయంలో పదిలపరచుకుని ఆరాధిస్తున్నాడంటే, స్త్రీకి అంతకన్న కావలసినదేముంది?

ఆ రాత్రి ప్రొద్దుపోయాక డాక్టర్ రాజారావు ఇల్లు చేరుకున్నాడు.

"కొత్తచోటు, కొత్త ప్రదేశం! నీకు నచ్చిందో, లేదో?" అన్నాడు రాజారావు. డైనింగ్ టేబుల్ ముందు

కూర్చుంటూ.

"కొత్త అయితేనేం! ఇల్లూ, ఈ వాతావరణమూ నాకు బాగా నచ్చినయ్. ఎల్లకాలం ఇక్కడే ఉండి పోదామా అనిపిస్తోంది అప్పుడే!" అన్నది సరోజ.

రాజారావు పకపక నవ్వాడు. "వెల్! వెల్! మొదటి రోజు అలానే ఉంటుంది. రెండురోజులు గడిచాక ఈ ఇంటిలోని నిశ్శబ్దతకు విసుగెత్తి, బోర్ కొడుతుంది!"

"అన్నట్టు నా దగ్గర పైకం ఉంది. దాన్ని మీ దగ్గర ఉంచితే భద్రం అనుకుంటాను!"

"నా దగ్గరెందుకు? రేపు వర్ధనమ్మను వెంటబెట్టుకుని వెళ్ళు. బ్యాంక్ ఎక్కౌంటు నీ పేర ఓపెన్ చేయి! తరువాత నీ ఉద్యోగం గురించి వాకబు చేశాను. 'లతా టెక్స్టైల్స్' ఓనరు లతాదేవి రేపు నిన్ను రమ్మన్నది" చెప్పాడు.

భోజనాలయ్యాక సరోజ తన గదిలోకి వెళ్ళి పడుకున్నది.

పగలంతా నిద్రపోవటం వలన, ఆమెకు నిద్రపట్టలేదు

క్రింద హాల్లో వర్ధనమ్మ మాటలు వినిపించినయ్. అందులో తన ప్రసక్తి రావటంతో చెవులు రిక్కించి వినసాగింది సరోజ.

"అమ్మాయి చాలా యోగ్యురాలుగా కనబడుతోంది. ఆమె ఈ ఇంటికి ఇల్లాలవుతే ఎంత బాగుంటుంది?" వర్ధనమ్మ చిన్నగా అంటోంది.

"వర్ధనమ్మా! ఏమిటా మాటలు? కనపడ్డ ప్రతిఅమ్మాయి గురించీ నీవిలా మాట్లాడ్డం బాగోలేదు!" రాజారావు

కసురుకున్నాడు.

"లేకపోతే ఎన్నాళ్ళని ఇలాగ? నీ ఆలనాపాలనా చూసుకునే దెవరూ? అదీగాక వగలాడి చేతుల్లో కీలు బొమ్మ వయి, నీవు పాడైపోతుంటే, నేనెలా చూస్తూ ఊరుకోను?" వర్ధనమ్మ ఈ దఫా నిష్ఠూరంగా అంది.

"అందుకని! ఇంటికి వచ్చిన ప్రతి అతిథి మెళ్లో తాళి గట్టెయ్యమంటావ్! అయినా ఆ అమ్మాయి వయ సెక్కడా? నా వయసెక్కడ? నా కూతురి వయసుంది ఆ అమ్మాయికి!"

"అయితే మాత్రమేం బాబూ! మా రోజుల్లో మటుకు ఆ మాత్రం వ్యత్యాసం లేదూ? ఆ కాపరాలు ఎంత లక్ష ణంగా సాగినయ్!"

"ఇక ఆపు నీ సొద! వెళ్ళి నీ పని చూసుకో ఫో!"
వర్ధనమ్మ లోపల గదుల్లోకి వెళ్ళిపోయింది.
సరోజ ఆలోచనలు పరిపరివిధాల పోయాయి.

* * *

"లతా టెక్స్టైయిల్స్" చాలా పెద్ద దుకాణం. అనేక రకాల నూలు, టెర్లిన్, టెరీకాటన్ స్త్రీ పురుషుల ఉడు పులున్నయ్. ఆరుగురు మగవాళ్లు, అయిదుగురు యువ తులూ అందులో సేల్స్‌మెన్‌గానూ, సేల్స్‌గరల్సుగానూ పనిచేస్తున్నారు.

లతాదేవి సరోజను మరో అమ్మాయికి పరిచయం చేసింది.

"ఈ అమ్మాయి పేరు సునీత. ఈమె ఒక్కతే రూమ్‌లో వుంటోంది, ఆమె గదిలోనే నీవూ వుండు.

ఇదుగో సునీతా! ఈ రోజునుంచీ ఈమె నీకు అసిస్టెంటు! గుడ్డల బేరంలో ఆమెకు బాగా తర్ఫీదు ఇవ్వు!'' అంది లతాదేవి.

ఒకటి రెండు రోజులు సరోజకు పెద్దగా పని చెప్పలేదు సునీత. తర్వాత తర్వాత ఆమెపై పనిభారం పడింది.

సునీత నివాసంగూడ సరోజకు నచ్చలేదు. చిన్న గది. నాలుగైదు కాపరాలకు కలిసి ఒకటే కొళాయి, ఒకటే బాత్‌రూమ్, ఒకటే లెట్రిన్.

పల్లెవాతావరణంలో స్వేచ్ఛగా తిరిగిన సరోజకు ఇక్కడి యాంత్రిక జీవనం సుతరామూ నచ్చలేదు, అన్నిటికీ హడావిడి.

మరో నాలుగురోజులు గడిచేసరికి ఆ సుఖానికి గూడా అవాంతరం వచ్చింది.

బట్టల దుకాణంలో లత తమ్ముడు సరోజవైపు ఆకలిగా చూడటం, వెకిలినవ్వులు నవ్వడం, జనం లేనపుడు ఆమె దగ్గరకు వచ్చి ఏదో నెపంతో ఆమెను తాకటం ఇలాంటివి చేస్తున్నాడు. అతన్ని ఎలా వదిలించుకోవాలా అని బాధ పడుతుంటే, సునీత మరో కొత్త బెడద తెచ్చి పెట్టింది.

''సరోజా! ఇవాళ మా బావ వచ్చాడు రాత్రి పది గంటల ట్రెయిన్‌లో వెళ్ళిపోతాడు! అందాకా నీవు ఏదైనా మొదటి ఆట సినిమా చూసిరా!'' అంది.

పాపం! సునీత ప్రాణప్రదంగా ప్రేమించుకునే బావతో కులాసాగా మాట్లాడుకుంటుంది కదా అని, సరోజ అలానే సినిమాకు వెళ్ళివచ్చింది.

సరోజ వచ్చి తలుపుతట్టాక, సునీత తన బావను పంపి

వేసింది. ఆ వెళ్ళిపోతున్న వ్యక్తిని చూస్తుంటే సరోజకు కంపరం కలిగింది. త్రాగిన వాసనా, నల్లగా కారుమబ్బు రంగులో ఉన్నాడా వ్యక్తి, సిల్కు లాల్చీ. మెళ్లో బంగారు గొలుసు, చేతి వ్రేళ్ళకు ఉంగరాలూ, చేతికి ఖరీదైన వాచీ వుంది. వాటిని బట్టి ఆ వ్యక్తి స్థితిమంతుడే అయి వుండా లనుకుంది సరోజ.

మరి అంతటి స్థితిమంతుడైన బావ ఉంటే, అ స్తమానమూ బట్టల దుకాణంలో వెట్టి చాకిరీ చేసుకుని బ్రత కాల్సిన అవసరం ఏముంది అని అనుమానం కలిగింది.

మరి కొద్ది రోజుల్లో ఆ అనుమానం గూడ నివృత్తి అయింది. సునీతకోసం వచ్చేది ఒక బావకాదు. చాలా మంది బావలు వస్తున్నారు. అంటే సునీత ఘరానాగా చీకటి వ్యాపారం సాగిస్తున్నదా? ఛీ! ఛీ! ఆమె ఇంత నీచురాలని తెలిస్తే ఆమె గదికి తను రాకనే పోదునే అని బాధపడింది.

ఒకరోజు సునీతను నిలవేసింది సరోజ. "ఈ పాడుపని చేయకపోతే నీ ఒక్క పొట్ట గడవదా?"

సునీత ఆమెపై కోపగించుకోలేదు! పైగా వేదాంతిలా నవ్వింది. "నీకు అనుభవం తక్కువ! ఇల్లు వదలి బజారు కెక్కిన ప్రతి యువతి జీవితానికి గమ్యం ఇదే! అంత దాకా ఎందుకు? లతా టెక్స్‌టయిల్స్ సేల్స్ గరల్సు అందరూ లత తమ్ముడు మోహన్‌ని సంతృప్తి పరుస్తేనే వాళ్ళ ఉద్యోగాల్లో నిలద్రొక్కుకో గలరు!"

"వాడంతటి దుర్మార్గుడా?"

"కొద్దిరోజుల్లో నీకే అర్థమవుతుంది. వాడి చూపు

ఇప్పుడు నీమీదే వుంది. లత రికమెండేషన్ మూలాన నీవు వాడి ఆసరా లేకుండా వుద్యోగంలో చేరావు. అందుకే బాధ నీకు తెలీలేదు.' అయినా లత మాత్రం సామాన్యురాలా ఏం? ఆమెకు ఒక ప్రక్క భర్త ఉన్నాడు. అయినా డాక్టర్ రాజారావుతో సంబంధం పెట్టుకుంది. అంతటి ధనవంతురాలికి గూడ ఇంకా డబ్బుమీదే వ్యామోహమా?''

సరోజ మాట్లాడలేదు.

మర్నాడు మేనేజర్, సరోజను పిలిచి "సరోజా! మోహన్‌దాస్ భార్యకు చీరెలు కావాలట! ఫారిన్ నైలెక్స్ పది వెరైటీలు తీసుకుని రిక్షాలో వాళ్ళింటికి వెళ్ళి చూపించి రా! ఆమెకు నచ్చినవి ఉంచేసి, మిగతావి తీసుకువచ్చేయ్!'' అని చెప్పాడు.

సరోజ గుండె గుభేల్‌మంది. అయినా ధైర్యంచేసి బయలుదేరింది. మోహన్‌దాసు ఇతర యువతులపై చేస్తున్న అత్యాచారాల్ని అతడి భార్యకు తెలియజెప్పి, భర్తను చెప్పుచేతల్లో ఉంచుకోమని హెచ్చరిద్దామనే ఉద్దేశ్యంతో బయలుదేరింది చివరకు.

మోహన్‌దాస్ బంగళా ఎంతో అందంగా ఉంది. వాకిట్లో పనిమనిషి ఎదురుచూస్తోంది.

సరోజ రిక్షాలోంచి దిగంగానే, "అమ్మగారు మేడ మీద గదిలో ఉన్నారు! వెళ్ళండి!'' అంది పనిమనిషి.

చీరల మూట చంకలో పెట్టుకుని సరోజ లోపలకు వెళ్ళింది. లోపల కార్పెట్స్, సోఫాలతో ఇల్లు ఆధునా

తనంగా ఉంది.

ఇల్లంతా బోసిపోతూ, ఇంత నిర్మానుష్యంగా వుందేమా అని ఆశ్చర్యపడుతూ, మరోప్రక్క అనుమానిస్తూనే సరోజ మెట్లెక్కి మేడమీది గది చేరుకుంది.

బెడ్ మీద ఎవరో స్త్రీ పడుకుని వుంది. సరోజ బెడ్ దగ్గరకు వెళ్ళి చీరెలమూటను స్టూల్ మీద వుంచి "అమ్మగారూ" అని పిలిచింది.

బెడ్ మీద చీర కప్పుకునివున్న వ్యక్తి ముఖం ఇటు తిరిగింది.

ఆమె స్త్రీ కాదు! ముమ్మూర్తులా మోహన్ దాసే!

"ఆ చీర లెవరికి కావాలి? నీకోసమే ఈ శ్రమ అంతా!" అన్నాడు అతడు సరోజను తనమీదకు లాక్కుంటూ.

"నీవు అరిచినా ఆదుకోవటానికీ ఇంట్లో ఎవరూ లేరు! వద్దనుకున్నా, కాదనుకున్నా, నిన్ను అనుభవించటానికి నేను మాత్రమే వున్నాను" అంటూ ఆమెను ముద్దు పెట్టుకోబోయాడు మోహన్ దాస్.

ఆమె గింజుకుంది బలంగా. జాకెట్ పర్రున చిరిగి పోయింది.

సరోజ గదిలో ఒకవైపుకు పరుగెత్తింది. మోహన్ ఆమెను అనుసరించబోయాడు. అలమారులో వున్న ఫ్లవర్ వేస్ని అందుకుని, రెండుచేతుల్తో దాన్ని అతడిమీదకు విసిరింది. అతడు గభాల్న నేలమీదకు వంగాడు. ఫ్లవర్ వేస్ వెళ్ళి మరోవైపు గోడకు కొట్టుకుని ముక్కలైంది.

సరోజ అంతటితో ఊరుకోలేదు. చేతికందిన వస్తువు

నల్లా అతడిమీదకు విసురుతోంది. బాణవర్షంలా తన మీదకు వచ్చిపడుతున్న వస్తువుల్ని తప్పించుకునే యత్నంలో మోహన్ ఆమెను సమీపించలేకపోయాడు.

సరోజ వాకిలివైపు చూసింది, పారిపోవడానికి. మోహన్ ఆమె చూపుల్ని గమనించాడు. వాకిలివైపు పరుగెత్తుతున్న సరోజను అడ్డగించటానికి తనూ పరుగెత్తాడు.

సరోజ ధఢాలున ఒక తలుపు నెట్టింది. మోహన్ వచ్చి ఆ తలుపుకు ఢీకొన్నాడు. మళ్ళీ తలుపుని మరో ప్రక్కకు బలంగా ఊగించేసరికి, అది వెళ్ళి మోహన్‌కి కొట్టుకుంది మరోసారి. బ్యాలెన్స్ తప్పిపోయి క్రింద పడిపోయాడు, మోహన్.

సరోజ మెట్లమీదుగా క్రిందకు పరుగెత్తింది లేడిలా.

మోహన్ నేలమీదనుంచి లేచాడు. ఆమె వెంట బడ్డాడు.

సరోజ హాలు దాటుకుని మెయిన్‌డోర్ తెరుచుకుని లాన్‌లోంచి పరుగెత్తింది బయటకు.

"సరోజా ఆగు! సరోజా ఆగు!" అని అరుస్తూ ఆమె వెనుకే పరుగెత్తుకు వస్తున్నాడు మోహన్‌దాస్.

సరోజ మెయిన్‌గేట్ త్రోసుకుని రోడ్డెక్కింది. అస్తవ్యస్తంగా ఉన్న చీరచెరగు పాదం క్రింద పడింది. ఆమె తూలి ధఢాలున తారురోడ్డుమీద పడిపోయింది.

సరిగ్గా అదే సమయంలో ఆ దిశగా స్పీడుగా వస్తున్న కారు ఆమెని ఢీకొని, కీచ్‌మని అరుస్తూన్న బ్రేకులతో ఆగిపోయింది. అది డాక్టర్ రాజారావ్ కారు.

# 3

పూర్తిగా కోలుకున్నాక ఆసుపత్రినుంచి డిశ్చార్జ్ అయిన సరోజ మళ్ళీ డాక్టర్ రాజారావు ఇల్లు చేరుకుంది. శారీరకంగా కోలుకున్నాగానీ, ఆమె మానసికంగా బాగా కృంగిపోయింది. జీవితం అంటే విరక్తి కలగసాగింది.

ఆ రోజు రాత్రి భోజనాలయ్యాక డాక్టర్ రాజారావు తీరికగా కూర్చుని మెడికల్ జర్నల్ తిరగేస్తున్నాడు.

సరోజ అతడికెదురుగా వచ్చి కూర్చుంది.

"డాక్టర్! మీరు బిజీగా లేకపోతే మీతో కొంచెం మాట్లాడాల్సి వుంది!"

"యస్!" అంటూ రాజారావు మెడికల్ జర్నల్ని టీపాయ్‌మీద పడేశాడు.

సరోజకు ఎక్కడ ఎలా మొదలుపెట్టాలో తెలియక తికమక పడింది. చివరకు ఎలాగో గొంతు పెకలించుకుంది.

"మీ ఆసరాతో ఉద్యోగం సంపాదించుకుని నా కాళ్ళమీద నేను నిలబడగలగాలని ఎన్నో ఆశలతో వచ్చాను ఇక్కడకు. కానీ ఇల్లు వదలిన ప్రతి ఆడదాన్నీ, గూడు వదలిన పక్షిని వేటగాడెలా వేటాడతాడో, అలాగే ప్రతి పురుషుడూ ఆమెను కాటేయాలనే చూస్తాడు గానీ, తనలాగే స్త్రీ గూడ పొట్టకూటికోసం వచ్చిందని ఆలోచించడు. నాకు కలిగిన కొద్ది అనుభవంలోనూ, నేను గ్రహించగలిగిన సత్యం ఇది. నేను ఎటువంటి పరిస్థితుల్లో ఏక్సిడెంట్‌కి గురి అయినదీ మీకు ఈ పాటికి తెలిసే ఉంటుందనుకుంటాను!"

డాక్టర్ రాజారావు సిగరెట్ వెలిగించాడు.

"అవును! తెలిసింది! ఆ వెధవని కటకటాల వెనుకకు త్రోయించి ఉండేవాణ్ణి. అయితే అందుకు నీవు కోర్టుకెక్కి వాఙ్మూలం ఇవ్వాల్సి ఉంటుంది. నీ బ్రతుకు రచ్చకెక్కడం ఇష్టంలేక నేను విరమించుకోవాల్సి వచ్చింది!"

"పోనీండి! ఆ విషయం వదిలేయండి! ఇక నా భవిష్యత్తు ఏమిటని? లతా టెక్స్‌టయిల్స్‌లో మానేసి, మరోచోట చేరినా అక్కడ మాత్రం ఈ మోహన్‌దాస్ లాంటి వ్యక్తులు ఉండరని నమ్మకమేమిటి?"

"అందుకని ఏం చెయ్యాలనుకున్నావ్?"

"బెడ్‌లో ఉన్నన్నాళ్ళూ ఆలోచించినమీదట, ఒక నిర్ణయానికి వచ్చాను!"

"ఏమిటది?"

సరోజ పెదవులు వణికినయ్. "పెళ్ళిచేసుకుని ఒక వ్యక్తి నీడలో గృహిణిగా మారిపోవడమే!"

"ఉద్యోగం సంపాదించటంకన్న పెళ్ళిచేయడం, అందునా ఆడపిల్ల పెళ్ళిచేయటం ఎంత కష్టం!"

"నాకు నచ్చిన వరుడ్నిగూడ ఎన్నుకున్నాను!" సరోజ తల వంచుకుని నిదానంగా అంది.

డాక్టర్ రాజారావ్ సోఫాలోంచి ముందుకు వంగాడు ఆసక్తిగా.

"గుడ్! ఇంకనేం? ఎవరా వ్యక్తి?" అనడిగాడు.

"డాక్టర్! నే కోరుకున్న వ్యక్తితో నా వివాహం జరిపిస్తారా? నేనూ ఆట్టేకాలం బ్రతుకుతానని అనుకోను! పెళ్ళికాని యువతిలా చనిపోలేను. పెళ్ళిఅయిన పునిస్త్రీగా

చావాలని నా కోరిక. ఆ కోరిక తీరకుండానే నన్ను మృత్యువు కబళించినా, నా ఆత్మ ఉత్తమలోకాలకు పోలేదు, డాక్టర్."

"ఇంతకీ నీ మనసులోని వ్యక్తి ఎవరని?"

"డాక్టర్! మీరు భార్యావియోగులు. మీరే నన్ను ఎందుకు పెళ్ళాడకూడదు?"

డాక్టర్ రాజారావు తృళ్ళిపడ్డాడు. "వ్హాట్! ఏమిటి నీ వనేది?" అని అరిచినట్టుగా అన్నాడు.

"భయపడకండి డాక్టర్! నన్ను పెళ్ళాడి మీ బ్రహ్మచర్యాన్ని పాడుచేసుకో నక్కర లేదు. నేను ఎటు చావు కోసం ఎదురుచూస్తున్న దాన్ని. మీ అర్ధాంగిగా నన్ను స్వీకరించక్కర్లేదు. మీనుంచి నా కెటువంటి సుఖాలూ అక్కరలేదు. కేవలం లోకం దృష్టిలో నన్ను మీ గృహిణిగా చేసుకోండి చాలు. ఎటూ ఒకటి రెండు నెలలకన్న నేను ఎక్కువ బ్రతకను, ఒక వేళ అంతకన్న ఎక్కువ బ్రతికేట్టుంటే, ఏదైనా విషం మ్రింగి అయినా నా జీవితాన్ని అంతం చేసుకుంటానేగానీ, నావల్ల మీ కెటువంటి అసౌకర్యమూ కలగదని హామీ ఇవ్వగలను"

డాక్టర్ రాజారావు చాలాసేపు ఆలోచిస్తూ వుండి పోయాడు.

"నీ నిర్ణయాన్ని మరోసారి యోచించు సరోజా! నేను చాలా కఠిన స్వభావుడ్ని! పాషాణ హృదయం కల వాడ్ని, నేను ప్రాయంలో ఉన్నప్పుడు, అంటే ఇంత కన్నా చిన్నవాడిగా ఉన్నప్పుడు నా వివాహం జరిగింద. చాలా కొద్ది కాలంలోనే నా భార్య దారుణ పరిస్థితుల్లో

మరణించింది. ఆ రోజునుంచి నా హృదయం పాషాణమై పోయింది. మనసు కరుడుకట్టిపోయింది. ప్రతి చిన్న విషయాన్నీ సీరియస్‌గా తీసుకునే స్వభావం నాది. నాతో పెళ్ళి అంటే నిప్పుతో చెలగాటమే అనుకో!"

"నాకూ అలాంటి అనుబంధమే కావాలి డాక్టర్! కొద్ది వయస్సులోనే ఎండిమోడైన నా జీవితానికి, తన ఆప్యాయతను పంచి అనురాగాన్ని పెంచి, నా జీవితాశను పెంపొందించే భర్తకన్న మీలాంటి వ్యక్తే నాకు తగినవాడు డాక్టర్! నా కోరికను కాదనకండి డాక్టర్!" అంటూ ఆవేశంగా సరోజ రాజారావు కాళ్ళపై పడిపోయింది.

"లే సరోజా! లే! అంతగా ప్రాధేయపడాల్సిన పని లేదు. నా షరతులకు నీవు అంగీకరించి, వాటిని తు. చ. తప్పకుండా పాటిస్తానని హామీ ఇస్తే నిన్ను పెళ్ళాడటానికి నాకేం అభ్యంతరం లేదు."

"తప్పకుండా పాటిస్తాను డాక్టర్! అవేమిటో చెప్పండి."

"లోకానికి మాత్రమే నీవు నా భార్యవు. కానీ మన మధ్య ఎటువంటి సంబంధ బాంధవ్యాలూ వుండరాదు. ఏ రకమైన అనురాగానికీ, ఆప్యాయతకూ ఆస్కారం లేదు. నా ఇల్లు చక్కబెట్టి, నా స్నేహితుల దృష్టిలో నా భార్యగా నటించగలగాలి. నా గత జీవిత ప్రసక్తి ఎత్తరాదు. నేను ఎవరితో తిరిగినా, ఏంచేసినా, నీవు జోక్యం కలుగజేసుకోరాదు. బాగా ఆలోచించుకుని, నీ నిర్ణయాన్ని రేపుదయం తెలియజేయి. ఇన్ని చెప్పిన తర్వాత

గూడ నీవు నన్ను కట్టుకోవటానికే నిర్ణయించుకుంటే, ఈ ప్రపంచంలో నీకన్న తెలివితక్కువ స్త్రీ మరొకతె వుండదు గుడ్ నైట్!"

అంటూ డాక్టర్ రాజారావు తన బెడ్ రూమ్‌లోకి వెళ్ళి తలుపులు మూసుకున్నాడు.

సరోజ అలానే నేలమీద కూర్చుండిపోయింది, శూన్యంలోకి చూస్తూ. రాజారావు తనకు రేపుదయం వరకూ అంటే ఎనిమిది గంటల వ్యవధిని ఇచ్చాడు. కానీ తను ఒక నిర్ణయానికి ఎప్పుడో వచ్చేసింది.

అలసిపోయిన శరీరంతో, వేడెక్కిన మెదడుతో ఆమె సోఫామీద తలవాల్చి నిద్రలోకి జారుకుంది.

వర్ధనమ్మ బెడ్ షీట్ తెచ్చి ఆమెమీద కప్పింది, చలి వేయకుండా.

## 4

రిజిస్ట్రార్ ఆఫీసులో డాక్టర్ రాజారావుకీ, సరోజకూ నిరాడంబరంగా వివాహం జరిగిపోయింది.

ఆ సాయంత్రం అలంకార్ హోటల్‌లో రూఫ్ గార్డెన్ మీద పార్టీ ఇచ్చాడు రాజారావు. పురప్రముఖులు, అధికారులూ చాలామంది వచ్చారు విందుకు.

సరోజను బాగా ముస్తాబు చేసింది వర్ధనమ్మ. "చూడు తల్లీ! రాజారావు స్వభావం మొరటుగా వుండవచ్చు కానీ మనసు చాల సున్నితం" అంటూ గదిలోకి పంపింది సరోజను.

ఆ గదిని గూడ వర్ధనమ్మ ఎంతో ఆసక్తిగా అలంకరించింది. ఇటు సరోజగానీ, అటు రాజారావుగానీ ఆ విషయమే పట్టించుకోలేదు.

అగరొత్తులు, సెంటూ, మల్లెల వాసనతో గది ఉత్తేజ కరంగా వుంది.

ప్రతి యువతీ కలలుగనే మొదటిరాత్రిలోకి సరోజ నిర్వికారంగా అడుగుపెట్టింది. తను రాజారావు నుంచి దేన్నీ ఆశించదలుచుకోలేదు. ఎందుకంటే, తనేది కోరు కుంటే అదే తనకు అందకుండా పోయి తనకు అశాభంగం కలిగిస్తోంది జీవితంలో.

బెడ్ ప్రక్కనే సోఫాలో కూర్చున్నాడు రాజారావు.

"రా సరోజా! కూర్చో!" అని మాత్రం అన్నాడు.

సరోజ అతడికెదురుగా కూర్చుంది. "నిన్ను చూస్తుంటే జాలివేస్తోంది. కోరికోరి నరకంలాంటి ఈ మనోవ్యధను ఎందుకు తెచ్చుకున్నావా అని!" జాలిగా అన్నాడు రాజా రావు మళ్ళీ.

"సుఖసౌఖ్యాలపై నాకు మోజులేదు. నీడలేని ఆడ వారిపై అత్యాచారం జరిపే మగధీరులనుంచి రక్షణ మాత్రమే నేను కోరుకుంది. అది మీద్వారా నాకు లభ్య మైంది. పసుపు కుంకుమలతో పోవాలనుకున్నాను. అదే పదివేలు నాకు డాక్టర్!"

రాజారావు ముఖం అదోలా అయింది. "నేను నీకు తాళి గట్టిన భర్తను. నేను నీకు డాక్టరుకన్నా ఇంకేమీ కానా?"

"క్షమించండి. ఎటువంటి ఆప్యాయతనూ, అను రాగాన్ని పెంచుకోవద్దని మీరే ఆజ్ఞాపించారు గదా! అందుకే మిమ్మల్ని డాక్టరుగాను, నన్ను పేషెంట్ గానూ

భావించుకుంటున్నాను.”

రాజారావు పకాలున నవ్వేశాడు. “ఆల్ రైట్. అను క్షణం ఆదమరచి వుంటున్నావన్న మాట! నాకు కావల సింది అదేలే! వెళ్ళి బెడ్ మీద పడుకుని హాయిగా నిద్రపో! నేను ప్రక్క రూమ్‌లో పడుకుంటాను. తెల్లారాక నేనీ గదిలోకి వస్తాను!”

అని రాజారావు ప్రక్క గదిలోకి వెళ్ళి తలుపు మూసి గడియ పెట్టుకున్నాడు.

మరుక్షణం ఆ గదిలోంచి స్త్రీ నవ్వు వినిపించింది. సరోజ ఆశ్చర్యపోయింది. ఆ కంఠాన్ని గుర్తుపట్టటానికి యత్నించింది. కొంచెం సేపు ప్రక్క గదిలోని కంఠాల్ని ఆలకించిన తర్వాత ఒకటి రాజారావుదనీ, మరోటి లత గొంతు అనీ గ్రహించింది.

అయినా ఆమెలో ఎటువంటి ఉద్వేగము కలగలేదు. కళ్ళు మూసుకుని నిద్రపోవటానికి యత్నించింది.

సరోజ ప్రతిరోజూ రొటీన్‌కి అలవాటు పడిపోయింది త్వరలోనే.

ఉదయం లేవగానే డాక్టర్ రాజారావుకి టూత్ పేస్ట్ బ్రష్ అందించటం. తర్వాత టిఫిన్ కాఫీ, ఆ తర్వాత స్నానం; డ్రెస్, కోటూ అందించటం, బూట్లు లేసులు ముడివెయ్యటం; అతడు గేటుదాటేదాకా గుడ్లప్పగించి చూస్తూ నిలబడడం! మధ్యాహ్నం అతడు భోజనానికి రాడని తెలిస్తే బోయ్ చేతికి క్యారియర్ ఇచ్చి పంపటం; రాత్రి అతడు తిరిగి వచ్చేదాకా మేలుకుని ఉండటం; అతడికి వడ్డించి, తనూ కూర్చునేది భోజనానికి.

# 5

ఆ రోజు రాజారావు హడావిడిగా ఇంటికి వచ్చేశాడు.

"సరోజా! ఈ రాత్రికి మనం డిన్నర్‌కి వెళ్ళాలి. డాక్టర్ రజనీకాంత్ కుమార్తె వివాహానికి. ఏడింటికల్లా రెడీగా ఉండు! అంతేకాదు. మనం అక్కడగూడా ఇలాగే ఎడమొగం పెడముఖంగా ఉండటానికి వీల్లేదు. ఎంతో అన్యోన్యంగా మెలిగే దంపతుల్లాగ అందరికీ కనబడాలి! తెలిసిందా?"

సరోజ తల ఊపింది. రాజారావు బీరువా తెరిచి నగల పెట్టెను ఆమెకు అందించాడు. "ఈ చీరల్లో నీ కిష్టమైనది కట్టుకో! గులాబీ రంగుది మాత్రం ధరించకు! అదంటేనే నాకు ఎలర్జీ!"

డాక్టర్ రజనీకాంత్ కుమార్తె ఎంతో అందంగా ఉంది. ఆమె భర్తగూడ చాలా ఆకర్షణీయంగా వున్నాడు. రాజారావు డైమండ్ రింగ్ ప్రెజెంటేషన్ సరోజచేత వధువుకి అందజేశాడు.

ఆ తర్వాత విందు జరిగింది. విందు తర్వాతగూడ అతిథులు చాలమంది వెళ్ళలేదు. కుర్రకారువాళ్ళు కొందరు పాటలు పాడారు. మరికొందరు బాల్‌రూమ్ డ్యాన్స్ చేశారు. ఇంకా కొంతమంది సినిమాపాటలు పాడితే, వాటికి అనుగుణంగా అభినయించారు మరికొందరు.

పెద్దవాళ్ళంతా చుట్టూ సోఫాల్లో కూర్చుని వాళ్ళ ఉషారుని చూసి సంతోషిస్తున్నారు.

అంతలో ఒక జట్టు రాజారావు, సరోజల్ని చుట్టుముట్టారు.

"డాక్టర్! మీ శ్రీమతిగారిచేత ఒక పాట పాడించండి!" అని గోలచేయటం సాగించారు.

"అబ్బే! నాకు పాటలు రావండీ!" సరోజ మొత్తుకున్నా వినలేదు.

"ప్లీస్! ఏదో ఒకటి! సినిమా పాట అయినా సరే! పాడు డార్లింగ్!" అన్నాడు రాజారావు.

సరోజ ఏదో భక్తిగీతం పాడింది. అందరూ మెచ్చుకున్నారు బాగుందని.

ఒక యువకుడు ఆరంజి జ్యూస్ తెచ్చి అందించాడు సరోజకు—"మీరు పాట పాడి అలిసిపోయారు. ఈ జ్యూస్ త్రాగాల్సిందే!" అంటూ.

"వద్దండీ!" అని నిరాకరించబోయింది సరోజ.

"తీసుకో సరోజా! వద్దంటే సభ్యతగా ఉండదు" రాజారావు సూచనపై సరోజ జ్యూస్ త్రాగింది. ఆ యువకుడు తన పేరు 'పతి' అని పరిచయం చేసుకున్నాడు. హౌస్ సర్జన్ చేస్తున్నాట్ట. డాక్టర్ రజనీకాంత్ కి దగ్గర బంధువట.

అతడు రాజారావు, సరోజల దగ్గరే కూర్చుని బాతాఖానీ వేయటం మొదలెట్టాడు.

రాజారావు అతడితో కుతూహలంగా మాట్లాడుతున్నాడు. కానీ సరోజకు మాత్రం ముళ్ళమీద కూర్చున్నట్టుగా ఉంది.

పతి అందమైన యువకుడు. కన్నె వయసుని కలవరపెట్టి వశం చేసుకోగల ఆకర్షణలన్నీ ఉన్నాయ్ అతడిలో. అందుకే అతడివైపుగూడ కన్నెత్తి చూట్టంలేదు. ఎటో

చూస్తూ కూర్చుంది.

"అప్పుడప్పుడు మా ఇంటికి వస్తుండండి. మీకు మెడిసిన్‌లో ఏవైనా సందేహాలుంటే, వాటిని నేను నివృత్తి చేస్తాను."

"చాలా థ్యాంక్సండీ! తప్పకుండా వస్తాను! వస్తానండీ శ్రీమతి సరోజాగారూ!" అంటూ పతి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పార్టీ అయిపోగానే రాజారావు, సరోజకూడా ఇంటికి వెళ్ళిపోయారు.

## 6

ఆమర్నాడే పతి ఊడిపడ్డాడు. స్కూటర్‌ని లాన్‌లో ఆపి, లోపలకు వచ్చాడు అతడు.

సమయానికి వరదమ్మగూడ ఇంట్లో లేకుండా, సరుకులు కొనుక్కురావాలని బజారుకు వెళ్ళింది.

"చూడండి సరోజగారూ! కాకి ముక్కుకు దొండపండులాగ ఈ ముసలాయన్నెలా కట్టుకున్నారు మీరు!" సన్నగా నవ్వుతూ ప్రశ్నించాడు పతి.

సరోజ అతడివంక కొరకొర చూసింది. "డాక్టర్‌గారి దగ్గర వైద్యసందేహాలు తీర్చుకోవాలనే మిషతో రావటం ఎందుకు? మా సంసారం విషయం ఆరా తీయుటమెందుకు? ఇలాగయితే ఇక మీరు మా ఇంటికి రాకండి!"

"అవును! చల్లకొచ్చి ముంత దాచడం ఎందుకు? మీ అందం, నాజూకుతనం నన్ను ముగ్ధుణ్ణి చేశాయ్. నిజానికి నేను మీ కోసమే రాజారావుతో పరిచయం చేసుకున్నాను."

"నీ చూపుల్నిబట్టి ఆనాడే అనుకున్నాను నీ విలాంటి వాడివని. నీవు మేకవన్నె పులివని రాజారావుగారు గ్రహించలేకపోయారు! లే ముందు! మర్యాదగా బయటకు నడుస్తావా? లేక తోటమాలిని పిలిచి మెడబట్టి గెంటించ మంటావా?" భద్రకాళిలా అయిన సరోజను చూసి పతి నిజంగానే భయపడ్డాడు.

సోఫాలోంచి లేచి "హుఁ...నాకు మీవల్ల జరిగిన అవమానానికి మీరు తగిన శాస్తి పొందుతారు!" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి డాక్టర్ రాజారావు చిందులు త్రొక్కుతూ ఇంటికి వచ్చాడు.

"సరోజా! సరోజా!" అని అరిచాడు వస్తూనే.

"ఏమిటండీ?" అని అడిగింది సరోజ, కంగారుగా.

"పతి ఇవాళ మనింటికి వచ్చాడట గదా? నీవు చాలా మర్యాద చేశావనీ, ఎన్నడూ మరిచిపోలేని ఆతిధ్యం ఇచ్చావనీ చెప్పాడు!" అతడి మాటల్లో వ్యంగ్యం కొట్టొచ్చినట్టుగా కనుపిస్తోంది.

"నేను కాబట్టి అంతటితో ఆగింది. ఇంకో స్త్రీ ఐతే అతడ్ని ఎడంకాలు చెప్పుచ్చుకుని కొట్టి పంపేది."

"ఎందుకో? మనింటికి రావడమేగా అతడు చేసిన అప రాధం?"

"నేను మీకు కాకిముక్కుకు దొండపండులా ఉన్నానట! మీ రివ్వలేని సౌఖ్యాన్ని అతడిస్తాడట!"

"అయిందా నీ కట్టు కథా? ఇంకేమన్నా వుందా?" రాజారావు వెటకరించాడు. సరోజ ఒక్క క్షణం

ప్రమాన్పడిపోయింది.

"కట్టు కథేమిటి? నేను చెప్పేది వాస్తవమే!"

"వరదమ్మనుగూడ అతడు రాగానే నీవే ఏదో మిషపై బయటకు పంపేశావనీ, అతడు ఒంటరిగాడ్ని చేసి నీవు మీదబడినావట! అతడు మనోనిగ్రహం కలవాడు, సంస్కారి కాబట్టి నీకు బుద్ధి చెప్పాడట! నీ తప్పు అతడి మీదే వేస్తున్నావా?"

సరోజకు నోట మాట లాలేదు. అయినా తన బలాన్నంతా కూడదీసుకుని "పచ్చి అబద్ధం! అదంతా నమ్మకండి!" అని అరిచింది.

"అబద్ధమాడి నన్ను నమ్మించలేవు సరోజా! అతడు కావాలనుకుంటే, నీకన్న అందమైన ఆడవాళ్ళు కోకొల్లలుగా దొరుకుతారు. నీలాటి జడపదార్థానికి అతడు కక్కుర్తిపడాల్సిన పనిలేదు. నీ కోసం అతడు ఛస్తే దేబిరించడు. అతడ్ని చూడంగానే నీవై ఒళ్ళు పై తెలియకుండా ఒంటరిగా వున్నాడని అతడ్ని వశపరచుకోబోయి వుంటావ్!"

"ఆ పతిగాడి రాక మీలో అనుమానాల్ని రేపుతుందనీ, మన కొంపకు చిచ్చు రగుల్కొంటుందనీ, నేను మొదట్నుంచీ అనుమానిస్తూనే ఉన్నాను." అంటూ సరోజ రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని ఏడుస్తూ గదిలోకి వెళ్ళిపోయింది.

ఈ సంఘటనతో రాజారావు, సరోజల మధ్య పెద్ద అగాధం ఏర్పడిపోయింది. ఇద్దరూ చాలా మితంగా మాట్లాడుకుంటున్నారు. అయినా సరోజ తన విధిలో ఏ

లోటూ రానివ్వలేదు. అతడి పనుల్ని సక్రమంగా నిర్వ ర్తిస్తోంది.

మరోవారం గడవక ముందే పతి మళ్ళి ఊడిపడ్డాడు. సరోజ గుండెల్లో రాయి పడింది.

ఎవరో పనికట్టుకుని పంపినట్టుగా వర్ధనమ్మ గూడ బజారు పనిమీద వెళ్ళింది అప్పుడే. పతిరాకకూ, వర్ధనమ్మ పోకకూ ఏదైనా అవినాభావ సంబంధం వున్నదా? పతిని గౌరవించి ఆదరించలేదని అతడు రేపు రాజారావుతో ఫిర్యాదు చేయవచ్చు, మళ్ళి రాజారావు తన మీద మండిపడతాడు. అయినా తను పతికి గుణపాఠం చెప్పటానికే నిశ్చయించుకుంది.

"డాక్టర్‌గారు ఇంట్లో లేరనుకుంటాను?"

"లేరని తెలిసేకదా తమరి రాక!" వెటకారంగా అంది సరోజ.

"నా రాక ఎందుకో గ్రహించారన్నమాట! నాకు సగ భారం తగ్గించారు. క్రితంసారి నేవచ్చి వెళ్ళాక, డాక్టరు గారు మిమ్మల్ని అనుమానించి, కేకలేసి ఉండాలే!"

"నీ పుణ్యం ఊరకే పోతుందా? కొట్టేటంతపని చేశారు!"

"అలాగే ఇంకో రెండు మూడు సార్లు జరిగితే మీరే నాదారికి వస్తారు!" పతి వెకిలిగా నవ్వుతున్నాడు.

"మిస్టర్ పతీ! నీ నయగారపు మాటలకు నేను లొంగను. నా భర్త నన్ను కొట్టనీ, కొయ్యనీ! నీ కోరిక మాత్రం తీరదు, నా కంఠంలో ప్రాణం ఉండగా!"

"కోరికోరి ఎందుకంత కష్టాల్ని కొనితెచ్చుకొంటావ్!

నీ భర్తకు అనుమానం గూడ కలగకుండా, యథేచ్ఛగా సుఖాల్ని అనుభవించుదాం రా! కాదంటే నేను ఇక్కడ నుంచి వెళ్ళిపోయాక నేనేం చేస్తానో తెలుసా? నేరుగా నీ భర్త దగ్గరకు వెడతాను. నీవు రికాలో నా రూమ్‌కి వచ్చి నన్ను లొంగదీసుకోవడానికి యత్నించావని చెబుతాను. 'పెళ్ళాన్ని గట్టిగా అదుపులో పెట్టుకో. ఇలా బరి తెగించి ఊరిమీద పడకుండా!' అని గట్టిగా హెచ్చరిస్తాను. దాంతో డాక్టర్ రాజారావు కోపంగా వచ్చి నీ పని పడతాడు!''

''నీవు లక్ష పితూరీలు చెప్పుకో! నేను మాత్రం నీకు లొంగేది లేదు!'' అంటూ సరోజ రోడ్డుమీదకు చూసింది. ''అమ్మయ్య! వర్ధనమ్మ వస్తోంది లే!'' అంది పెద్దగానే, స్వగతంలాగ.

పతి కుర్చీలోంచి లేచాడు. ''మరోసారి కలుద్దాం! సెలవివ్వండి!'' అంటూ గబగబ వెళ్ళిపోయాడు.

సరోజ నిట్టూర్పు విడిచింది. నిజానికి వర్ధనమ్మ రావటం లేదు. అలా బెదురుపెడితే పతి వెళ్ళిపోతాడేమో అని యోచించింది. ఆమె ప్లాన్ ఫలించి పతి వెళ్ళిపోయాడు.

పతి పీడ తొలగిపోయిందన్న సంతోషం కొద్ది క్షణాల్లోనే మాయమయింది. వాడి వాలకం చూస్తుంటే, పతి చెప్పినంత చేసేలా ఉన్నాడు.

పతి మాటలకు రాజారావు కారాలు, మిరియాలూ నూరుతూ ఇంటికి వస్తాడు. బహుశా తనకు దెబ్బలు తగులుతాయి. లేదా ఇంటినుంచి గెంటివేయబడవచ్చు.

ఆ ఆలోచనని భరించలేక పోయింది సరోజ. ఎన్నో

కష్టనిష్ఠూరాలు అనుభవించాక, తను ఈ మాత్రం నిల ద్రొక్కుకో గలిగింది. మళ్ళీ ఈ శాస్త్ర ఆసరా తొలగి పోయి తను రోడ్డున పడేకన్నా, చావే మేలేమో!

సరోజ అల్మైరా వేపుగా నడిచింది.

## 7

వరధనమ్మ ఆదుర్దాగా ఫోన్ ఎత్తింది రాజారావు డిస్పె న్సరీకి డయల్ చేసింది.

"బాబూ! సరోజమ్మ ఏదో విషాన్ని పుచ్చుకున్నట్టుగా వుంది. మాటా పలుకూ లేకుండా పడిపోయింది. నోట మ్మట తెల్లగా నురగ వస్తున్నది. మీరు అర్జెంటుగా రండి బాబూ!"

"అలాగా! ఇదో ఇప్పుడే వస్తున్నాను!" అన్నాడు రాజారావు అవతలవైపు నుంచి.

మరో పదినిముషాల్లో కారు పోర్టికోలోకి వచ్చిఆగింది. డాక్టర్ రాజారావూ, పతీ ఇద్దరూ కారులోంచి దిగారు. ముందుసీటులోంచి నర్స్ మెడికల్ బ్యాగ్ తీసుకుని లోపలకు నడిచింది.

రాజారావు, సరోజకు ఇంజెక్షన్ ఇచ్చాడు.

పతి నేలమీద ఖాళీగా పడివున్న మందు సీసాని తీసు కుని దానిమీద పేరు చదివాడు. "ఇది ప్యూర్ పాయి జన్ డాక్టర్. దీన్ని తీసుకున్నవాళ్ళు బ్రతుకుతారం టారా?" అని అడిగాడు పతి.

రాజారావు చిరునవ్వు నవ్వాడు. "ఆమె ఇదివరకు నుంచే ఆత్మహత్య గురించి మాట్లాడుతోంది. అందుకే పాయిజన్ అని ఉన్న మందులన్నిటిలోనూ వేరే మందులు

పోశాను. ఇప్పుడు సరోజ త్రాగింది పాయిజన్ కాదు. కొంతసేపు మత్తుని కలిగించే మందు మాత్రమే!''

"మంచి పనిచేశారు సార్! పాపిష్టివాడ్ని! నా నుంచి నిప్పులాంటి మనిషికి ఎంత కష్టం వచ్చింది?" నొచ్చుకున్నాడు పతి.

సరోజ నిదానంగా కళ్ళు తెరిచింది.

"నన్నెందుకు బ్రతికించారు? చావటానికి కూడ నాకు అర్హత లేదా?'' కన్నీరు కారుస్తూ అంది సరోజ.

"సరోజా! నన్ను మన్నించు. నీపై నా కటువంటి అనుమానం లేదు. నిజానికి పతిని నేనే మనింటికిపంపాను. ఏదో మిషతో అదే సమయంలో వర్ధనమ్మ బజారుకు వెళ్ళే ఏర్పాటు చేశాను. నీ నిబ్బరాన్ని పరీక్షించటానికే ఇలా చేశాను. నా పరీక్షలో నీవు గెలిచావు!''

"గెలిచి ఏం లాభం? నేను బ్రతికి ఏం సాధించను?'' సరోజ నిరాశగా పలికింది.

"లేదు సరోజా! నిన్ను మనస్ఫూర్తిగా స్వీకరిస్తున్నాను.''

సరోజ ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటి మీరనేది?'' నమ్మలేనట్టుగా అంది.

"అవును సరోజా! నా గత చరిత్ర నీకు తెలియదు కదూ? ఆ ఫోటోలో కన్పించే స్త్రీ నా మొదటి భార్య. అందగత్తెను ఏరికోరి చేసుకున్నాను. కానీ ఆమె నాకు తీరని ద్రోహం తలపెట్టి, నా కనుగప్పి తన ప్రియుడితో సుఖించసాగింది. చివరకు ఇద్దరూ లేచిపోయారు, నాకు ఉత్తరం రాసిపెట్టి. అయితే వాళ్ళు ప్రయాణం చేస్తున్న

టాక్సీ ఏక్సిడెంటుకి గురిఅయింది. టాక్సీ రోడ్డుప్రక్క చెట్టుకు గుద్దుకొని టాక్సీలోని ముగ్గురూ దుర్మరణం పాలయారు.

"ఆ రోజునుంచీ నాకు స్త్రీలంటే నమ్మకం పోయింది అలాగే నాతో పరిచయం అయిన లత, తను వివాహిత అయి గూడ నన్ను మోహంలో పడేసుకుంది. ప్రపంచం లోని స్త్రీ జాతిఅంతా ఇంతేనా అని నాలో విరక్తి భావం ఏర్పడింది. మగువల మనసు చపలచిత్తం అనుకున్నాను.

ఆ కారణంవల్లనే ఇన్నాళ్ళూ నేను మళ్ళీ వివాహం చేసుకోలేదు.

"తరువాత పరిస్థితుల ప్రభావంవల్ల నిన్ను పెళ్ళాడ వలసి వచ్చింది. నాకారోజే ఎందుకో అనుమానం వచ్చింది నీ వాలకం అందరిస్త్రీలలాగా లేదనీ నీవు నిగ్రహం కల దానివనీ! అయినా నీ మనోనిగ్రహం తెలుసుకోవాలని పతిని సాయంకోరి నీ మీదకు ఉసిగొల్పాను. కానీ ఇంత త్వరగా ఈ అఘాయిత్యానికి ఒడిగడతావని ఊహించ లేకపోయాను."

"మీరు...మీరు...ఇంతగా మారారంటే నేను నమ్మ లేకుండా వున్నాను." సరోజకు మాటలు తడబడినయ్.

"నిజం సరోజా! నీవు నా మనోనేత్రాల్ని తెరిపించావు. ఎల్లుండే మనం హనీమూన్ కి ప్రయాణమవుతున్నాం. మద్రాసు సిటీ చూసుకుని మహాబలిపురం పోదాం. వారం రోజులపాటు డిస్పెన్సరీని పతికి అప్పజెపుతున్నాను."

సరోజ చేతులెత్తి నమస్కారించింది. "నా జీవితం చరితార్థమయింది. నా ఆశయం ఫలించింది. దేవుడు చివరికి నామీద కనికరించాడు" అంది.

"అవునమ్మా! ఈ నాటితో నీ కష్టాలన్నీ గట్టెక్కనయ్! ఇకనన్నా అయ్యగార్ని కొంగున ముడివేసుకుని, నీ నుంచి చేజారిపోకుండా కాపాడుకో తల్లీ!" అంది వర్ధనమ్మ.

రాజారావు, పతీ ఇద్దరూ నవ్వుకున్నారు.

సరోజ చెక్కిళ్ళమీద నునుసిగ్గు మెరిసింది.

—: ఐపోయింది :—

# ప్రత్యేక హాస్య అనుబంధం

## ఓ ప్రేమికుడి కథ!

### కె. రవీంద్రప్రసాద్

"బాస్టర్డ్!" అన్నాడు రంగారావును సుబ్బారావు.

సుబ్బారావు మొఖం ఇంత చేసుకొని. "అదే తెలుగులో తిట్టినట్లయితే నిన్నిపాటికి ఏం చేసుండేవాడ్నో తెలుసా" అన్నాడు కోపంగా.

"ఏం చేస్తావ్. దద్దమ్మా! కబుర్లవరకే" ఇంకా వ్యంగ్యంగా అన్నాడు సుబ్బారావు.

రంగారావు బుగ్గల్లోకి ఆవిరి పొంగుకొచ్చింది. బుగ్గలతోపాటు కళ్ళూ ఎర్రబడ్డాయి.

"సుబ్బారావ్! నీ హద్దుల్లో నీవుంటం మంచిది. లిమిట్స్ దాటకు ఎప్పుడూ" అన్నాడు గొంతు గాద్గద మవుతుండగా.

"పోరా! ఇడియట్_నీవూ కబుర్లు చెప్పే వాడివే! ఇదే ఇంకో మొగాడికి జరిగితే ఈపాటికి అటో ఇటో తేల్చేసు కునేవాడు." అన్నాడు కవ్వింపుగా రంగారావును సుబ్బారావు.

"అది నా స్వవిషయం."

"ప్రతి వోడిపోయిన వెధవా, చివరికి అనే మాట ఇదే" అన్నాడు సుబ్బారావు.

"ప్లీజ్! సుబ్బారావు నన్ను రెచ్చగొట్టకు."

"ఛీ. ఛీ. నిన్ను చూస్తుంటేనే నాకు అసహ్యంగా వున్నది. అసలు ఎలా ఈ అవమానాన్ని భరించావ్."

"అది నాకు అవమానం కాదు."

"ఎలా అవుతుంది చచ్చు దద్దమ్మలకు."

"నేను దద్దమ్మను కాను."

"అవును. కాదు, ఆడదానివి."

"సుబ్బారావ్! మాటలు జాగ్రత్తగా రానీ."

"ఇందాకటినుండీ జాగ్రత్తగానే రానిస్తున్నాను. మరీ నువ్వేం చేస్తున్నావో. ఏం చేశావో నాకేం తెలియ లేదు." అన్నాడు కవ్వింపుగా సుబ్బారావు.

రంగారావు ఎరుపుముఖంతో "ఇప్పుడు నన్నేం చేయ మంటావ్?" అడిగాడు.

"కసి తీర్చుకోమంటాను. పగ తీర్చుకోమంటాను." అన్నాడు.

"కసి, పగ ఎలా తీర్చుకోను?"

"నీవల్లకాదంటే నాకు చెప్పు. నేను ప్రతీకారం తీర్చుకుంటా."

"నీకూ దీనికి సంబంధం లేదుకదా."

"నీవు నా ఫ్రెండువు. నీకు జరిగితే అవమానం నాకు జరిగినట్లు కాదా. చెప్పు. నీవు తీర్చుకుంటావా? నన్ను తీర్చుకోమంటావా?"

"పగబట్టేంత తప్పేం చేసింది ఆమె."

"అందుకే నువ్వు బాస్టర్డ్‌వి."

"సుబ్బారావ్!"

"ఎందుకూ గొంతు చించుకుంటావ్? వొక అమ్మకూ వొక అయ్యకూ పుట్టిన వాడివైతే రోషం—మీసం వుంటాయి. అవి రెండూ లేవు నీకు!"

రంగారావు ఆవేశంతో వొక్క వురుకున సుబ్బారావు మీదికి గెంతి, గొంతు వుచ్చుకొని, "ఇడియట్! ఇందా కటినుండి చూస్తున్నాను. ఇష్టం వచ్చినట్లు వాగుతున్నావు. ఇప్పుడు నిన్నెవడు రక్షిస్తాడో రక్షించమను. ముందు నిన్ను చంపి తర్వాత దాని అంతు చూస్తాను." అంటూ సుబ్బారావు మెడను పట్టుకొని పిసక నారంభించాడు.

దీంతో సుబ్బారావు బిత్తరపోయాడు. బలవంతంమీద రంగారావును విడిపించుకొని "క్షమించు" అన్నాడు.

"ప్రతి వెధవా ఇదొకటి నేర్చుకొన్నాడు. తప్పు చేయటం-క్షమించమంటం. ముందు అపాలజీ చెప్పు."

"ఏమనీ!"

"మా అమ్మనీ-నాన్ననీ తిట్టినందుకు."

"క్షమించు. కానీ మా అమ్మనీ, నాన్ననీ కావాలని తిట్టలేదు. నువ్వొ ఆడదాని చేతిలో ఘోరంగా అవమానం పొందినందుకు. నిన్ను రెచ్చగొట్టి! ఆమెమీద పగ తీర్చుకోమని వురికొల్పటానికే నిన్ను తిట్టాను." అన్నాడు సుబ్బారావు.

"ఆల్ రైట్! దాని సంగతి నేను చూచుకొంటాను."

"ఏం చేస్తావ్?"

"నా ఇష్టం."

"అలాకాదు. నీ పథకం నాకు చెప్పు. పోలీసులకు చిక్కకుండా నీవే ప్రయత్నమయినా చేయ్!"

"డియర్ సుబ్బారావ్! ఇంతకాలం నువ్వు నా మెత్తదనాన్ని చూశావ్. ఇక ముందు ఈ రంగారావు ఎటువంటి వాడో తెలుస్తుంది" అన్నాడు వికటంగా నవ్వుతూ.

సుబ్బారావు బిత్తరపోయాడు. రంగారావు ఎప్పుడూ అట్లా నవ్వలేదు. రంగారావు అంత వికటంగా, అంత క్రోధంగా, అంత కసిగా, ద్వేషంగా నవ్వగలడని సుబ్బారావు ఊహించనైనా ఊహించలేదు.

నవ్వి, నవ్వి, "సుబ్బారావ్! నీ సహాయం నాకు కావాలి."

"నా సహాయమా! అది ఎప్పుడూ నీకు ఉంటూనే వుంటుంది."

"అయితే విను! దాన్ని చంపేస్తాను."

"హత్యా???"

"అవును హత్యే!"

"మరి జైలుకు వెళ్ళాలి కదా!"

"అందుకే నీ సహాయం కావాలి."

"అంటే! నీ బదులు నేను పోనా."

మళ్లా వికటంగా నవ్వేడు రంగారావు.

ఆ నవ్వును చూసి బిత్తరపోయాడు సుబ్బారావు.

"చచ్చు పీనుగా! ఇందాకటినుండి నా క్రిందకి కట్టెలు

ఎగదోసి, తిరిగి చేతులు ముడుచుకు కూర్చుంటే ఎట్లా!" అన్నాడు రంగారావు.

"ఏం చేయమంటావో చెప్పు."

"ఏం చేయక్కర్లేదు. నే చెప్పినట్లు చేయ్" అన్నాడు రంగారావు.

"సరే" అన్నాడు సుబ్బారావు.

రంగారావు, సుబ్బారావుకు ఏదో చెప్పాడు. అంతే! సుబ్బారావు అదిరిపడ్డాడు. రంగారావు ఇంతకాలం సుద్ద అమాయకుడూ, వెర్రివాడూ అనుకున్నాడు. కానేకాదు జీనియస్!

## 2

పద్మ అందమైన అమ్మాయి. 35, 20, 35 కొలతలు గల శరీరం. రంగు ఎరుపు. పళ్ళు ముత్యాలు. నవ్వితే రత్నాలు. దివినుండి దిగివచ్చిన దేవకన్య.

ఆ అమ్మాయంటే అందరికీ ఇష్టం. కొంతమంది మాట్లాడితే చాలని, కొంతమంది చూస్తే చాలని, కొంతమంది పమిటె తగిలితే చాలని, చెయ్యి తగిలితే చాలని, ముట్టుకుంటే చాలని జీవితాలు ధన్యమైపోతాయని, తలస్తుంటారు.

ఆ అమ్మాయి చదివేది కాలేజీలో ముచ్చటగా బి. ఏ. మూడో సంవత్సరం. ఎలక్షన్లు లేకుండానే ఆ అమ్మాయి సెలక్షనయ్యింది కాలేజీ బ్యూటీగా - అఖండమైన వోట్ల మెజారిటీతో.

ఆమె నడిచినచోట ఇసుకను సీసాల్లో భద్రంగా దాచి, పూజచేసే ప్రబుద్ధులున్నారు.

ఆమె కూర్చున్న బెంచీమీద ముద్దులు పెట్టుకొనే పూజారులున్నారు.

ఆమె బట్టలువేసే చాకలివాడి దగ్గరకు పోయి, ఆమె బట్టలను అద్దెకు తెచ్చుకొని, ఆరాత్రి ఆ బట్టలనే కాంగలించుకొని తిరిగి మర్నాటికి చాకలికి అందజేసే రోమియోలున్నారు.

ఆమె నవ్వితే ముత్యాలు ఏరుకునే మిధ్యాయానులున్నారు.

ఆమె ఎటు నడిస్తే అటు పోయే ప్యారసైటులున్నారు.

ఆమె క్వీన్!

ఆ క్వీన్ కోసం పడిగాపులు కాసేవారు వేలమంది.

కానీ పాపం! ఆ అమ్మాయికి చదువిష్టం. మొగాడు స్త్రీకి ఎందుకు పనికివస్తాడో తెలియనంత అమాయకంగా ఉంటుంది.

చాలామంది ఆడవాళ్ళు తెలిసినా, తెలియనట్లు నటిస్తారు. కానీ ఈ అమ్మాయికి తెలియకే, తెలియనట్లుంటుందేమో నన్నట్లుంది.

ఆ పద్మ!

చేత అవమానించబడ్డాడు రంగారావు.

అదీ సుబ్బారావు చూస్తుండగా.

రంగారావు బావుంటాడు. అమితాబ్ లా లేకపోయినా, శత్రుఘ్నసిన్హా కాకపోయినా, శశికపూర్ లా ఉంటాడు.

అతన్ని హీరో అన్నారు కొంతకాలం. కానీ తర్వాత తెలుగు సినిమాల్లోలాగా చాలామంది బట్టలు కట్టించుకొని హీరోలయ్యారు. దాంతో రంగారావు పని గోవిందా అయింది.

కానీ రంగారావుకు కావలసింది హీరో వర్షిప్ కాదు.

పద్మ సాహచర్యలు!

పద్మను హీరోయిన్ని చేసి లక్షాత్రాంభైకలలు కన్నాడు.

రకరకాలైన డ్రీమ్స్ పొందాడు.

అన్నిట్లో దేవత పద్మ!

కానీ దేవుడు తను కాలేకపోయాడు రంగారావు.

కారణం నిద్రపోతున్నాడు కాబట్టి!

కానీ ఘోరమైన అవమానం జరిగింది రంగారావుకు.

అదే...

* * *

పద్మను చాలాకాలంగా ఎరుగును రంగారావు. అంటే కాలేజీలోనే. మాటలతో కాదు. చూపులతోనే. అదీ వొన్ వే ట్రాఫిక్కే.

పద్మ! తలంచుకుని పోతూంది. తలొంచుని వస్తూంది. తన దారిపొడుగునా లక్షాతొంభై కళ్ళతోరణాలు ఉంటా యని ఆ పిల్లకు తెలియదో? తెలుసో?

ఆ రోజు!

"పద్మగారూ!" పిలిచాడు రంగారావు.

ఏమన్నట్లు చూసింది పద్మ.

దూరంగా ఎవ్వరూ లేరు. కానీ చెట్టుచాటున సుబ్బా రావును చూడలేదు రంగారావు.

"నేను... మిమ్మల్ని."

"ఆ..."

"ప్రేమిస్తున్నాను" అన్నాడు.

"ప్రేమా!" అంది, అదేమిటో తెలియనట్లు.

చుట్టూ చూశాడు, ఎవ్వరూ లేరు. ఆరోజు పద్మ లైబ్రరీలో ఉండిపోయింది. ఆరయింది. కాలేజీ అంతా నిర్మానుష్యం!

ప్రేమ అంటే ఏమిటో చూపిద్దామని, దగ్గరకి జరిగి, పద్మను కౌగలించుకుని గట్టిగా ముద్దు పెట్టుకోబోయాడు.

ఆ పిల్ల సింహాప్పిల్లయ్యింది.

గబుక్కున రంగారావును విడిపించుకుని, అతని చెంప మీద చట్ చట్‌మని కొట్టసాగింది. ఆ పిల్ల అపర కాళిలాగున్నది. ఇంకా కసి తీరక, కాలి హైహీలు షూ తీసుకుని నెత్తిమీద, చెంపలమీదా వాయించసాగింది.

రంగారావు నిరుత్తురుడయ్యాడు. చేష్టలుడిగిపోయాయి. దిమ్మ తిరిగిపోయాడు. ప్రపంచం తిరిగిపోసాగింది.

అంతలో జరిగింది మరో అవమానం!

చుట్టుప్రక్కల చెట్లనుండి వరుసగా రాసాగారు. రంగారావులు... వాళ్ళతోబాటు సుబ్బారావు వచ్చాడు.

అంతమంది అక్కడుండేసరికి రంగారావు తల తీసేసినంత పనయ్యింది. అలాగే అక్కడే కూలబడి సీతమ్మవారిలాగా భూమిలోకి కూరుకుపోతే బావుండు ననుకున్నాడు. కానీ అతడు పవిత్రుడు కాదు కదా.

పద్మ ఆయాసంతో రొప్పుతూ చెప్పేసుకొని, వడివడిగా ఇంటికేసి నడవసాగింది.

రోజూ ఆమెను ఇంటిదగ్గర సురక్షితంగా దింపే బాడీగార్డులు ఆమె వెంట నడిచారు.

మరికొందరు రంగారావు పరిస్థితి చూసి జాలి చెందారు.

మరికొందరు ప్రేమను తమ లిస్టులోంచి కొట్టేశారు.

కొందరు ఏడ్చారు, కొందరు నవ్వారు.

కానీ సుబ్బారావు రెచ్చగొట్టాడు అతడిని "బాస్టర్డ్" అంటూ!

## 3

రంగారావు చెప్పిన పథకమేమంటే! పద్మ ఒంటరిగా ఏ సందులోనో, గొందులోనో కన్పడితే తీసుకెళ్ళి, పద్మను

గట్టిగా కౌగలించుకొని, ముద్దుపెట్టేసుకొని పరిగెత్తు కొచ్చెయ్యటం!

దీనివలన అతని కసి, పగ తీరుతుందట.

అయితే! ఈ పని ఇలా రంగారావులా చేయడట. వేషం మార్చుకుంటాడట - తెలుగు సినిమాల్లో చీటికీ మాటికీ వేషాలుమార్చే హీరోలా.

ఆ వేషంతో పద్మను ముద్దు పెట్టుకుంటాడట. పెట్టుకొని పరిగెత్తుకొని వచ్చేస్తాట్ట.

పద్మకు చస్తే తెలియదట తను రంగారావని. ఇదీ సుబ్బారావుకు రంగారావు చెప్పిన అద్వితీయమైన ప్లాను.

సుబ్బారావు "యస్!" అన్నాడు.

దానికి తగట్టు ఆ రోజునుండీ రంగారావు రకరకాలుగా క్రాపులు దువ్వుకోవటం, మీసం పెంచటం (వొరిజినాలిటీ కోసం) ఇంకా కొన్ని దుస్తులు సంపాదించటం (అద్దెకు కాదు___కారణం? వొకవేళ పట్టుబడితే ఆదుస్తుల అద్దె కొట్టువాడు పోలీసులకు సాక్ష్యం ఇస్తాడు కదా) మొదలగు భారీ కార్యక్రమాల్లో మునిగిపోయాడు.

సుబ్బారావు తను అన్నట్లుగానే సహాయ సహకారాలు అందజేయసాగాడు.

రంగారావు తయారయ్యాడు కొత్త వేషంలో. అతన్నిప్పుడు ఎవ్వరూ గుర్తించలేరు రంగారావని.

పద్మ వంటరిగా వచ్చే మార్గాలు రంగారావుకే కాదు, ఆమెను ఆరాధించే వారందరికీ తెలుసు.

పద్మ కాలేజీ రోడ్డుమీదగా వచ్చి, గాంధీచౌక్ సెంటరుగుండా, పండామణయ్యగారి వీధిలో గుండా తమ ఇంటికి పోతుంది. పండామణయ్యగారి వీధిలో జనం

ఉండరు. అదో సన్నటి వీధి. ఆ వీధి పొడవు 20 గజా లుంటుంది. ఆ 20 గజాల వీధి గుండా పుస్తకాలు 35 సైజుకు ఆనించుకొని, 35 సైజును హంసలా ఊగిస్తూ, 25 ను వంకరలు తిరిగేటట్టు నడుస్తూంది అందాల వయ్యారి పద్మ.

ఆ రోజు అమావాస్య! అదే మంచిరోజుగా భావించాడు రంగారావు. సుబ్బారావుకు చెప్పాడు, రంగంలోకి దూకుతున్నానని. సుబ్బారావు ఆశీర్వదించాడు.

ఆ రోజు పద్మ పండామణయ్యగారి వీధిగుండా వస్తున్నది. వీధిలో జనం లేరు. ఆ వీధిలో మొదటి గజంలో అడుగుపెట్టింది. 20 వ గజంలో అడుగు తీసేలోపల తన పని కానిచ్చుకొని పారిపోవాలనుకొన్నాడు. అంతకు తప్ప గత్యంతరం లేదు.

కారణం ఆ వీధి దగ్గరకు వచ్చేదాకా గూడా పద్మ వంటరిగా ఉండదు. స్నేహితురాండ్రు ఉంటూనే ఉంటారు. వాళ్ళు అక్కడ విడిపోతారు ఎవరింటికివారు. పద్మ వొక్కతే ఆ ఇరవై గజాలూ హంసలా నడుస్తూ ఆ వీధి దాటంగానే మరో గజానికి ఆమె ఇల్లు. రంగారావుది ఎంత సాహసమైన గుండె అంటె ఆమె ఇంటికి 21 గజాల లోపలే ఆమెను—ముద్దు పెట్టుకోవటానికి సాహసించిన వీరుడు.

పద్మ ఆరోజూ స్నేహితులందర్నీ వదలి-ఆ వీధిలో మొదటి గజం దాటింది. మెరుపులా ముందుకు దూకాడు. పద్మవెంటే నడవసాగాడు. వెనకా ముందూ చూసుకొంటున్నాడు. 10వ గజంలో తన పని పూర్తి కానిద్దామనుకొన్నాడు. ఎంచేతంటే మొదటి 6 గజాలూ-చివరి 6

గజాలూ అటూ ఇటూ పోయే వీధుల్లో మనుష్యుల దృష్టి లోకి వస్తాయి. అదే 10 వ గజంలో అయితే__ఎవరో ప్రేమికులు... భ్రాంతిలో పడవచ్చు.

పద్మ నడవసాగింది.

రంగారావు. కాదు షేర్ ఖాన్ వేషంలో వున్నాడు రంగారావు.

షేర్ ఖాన్ నడుస్తున్నాడు.

పద్మా నడుస్తున్నది.

పద్మ నడుస్తూ వెనక షేర్ ఖాన్ ను గమనించింది' వెంటనే నవ్వుకొంది. ఎందుకంటే ఆ వీధి సినిమా కాదు' అతను నటుడూ కాదు. ఆమె నటీ కాదు. షేర్ ఖాన్ ను రంగారావుగా గుర్తించింది పద్మ.

నవ్వుకొని 'దెబ్బలు చాల్లేదేమో!' అనుకొంది.

షేర్ ఖాన్ ధైర్యంగా నడుస్తున్నాడు. పదోగజం కోసం చూస్తున్నాడు. క్రితం రోజు వచ్చి టేపులో వో చచ్చు ఇంజనీరులా ఏవేవో కొలతలు కొలుచుకొని_ముద్దు పెట్టుకోవలసిన స్పాటు గుర్తులను కొని_అక్కడ బొగ్గుతో 'సున్నా' చుట్టుకొని వెళ్ళిపోయాడు. ఆ పదో గజంలో_ ఆ సున్నాలోకి ఎప్పుడు ఆమె ఎంటర్ అవుతుందో అప్పుడే తన పని కానిచ్చి_మిగతా తొమ్మిది గజాలూ రన్నింగ్ చేసి పారిపోవాలి.

పద్మ సున్నాను సమీపిస్తూంది.

షేర్ ఖాన్ సున్నానే చూస్తున్నాడు.

పద్మ సున్నాలో అడుగుపెట్టింది.

షేర్ ఖాన్ గబుక్కున ముందుకురికి పద్మను పట్టుకో బోయాడు.

ఇంతలో దెయ్యాల్లా...

గవర్నమెంటు ఫైరింజనుల్లా.

ఆపదభాంధవుల్లా.

రెండు మోటారు సైకిల్లూ, ఒక సైకిలు, నలుగురు మనుష్యులూ, ఆ స్పాట్ కు వచ్చేశారు.

మోటారుసైకిళ్ళ చప్పుళ్ళకు,

ఆ గోలకూ,

షేర్ ఖాన్ వెనక్కు చూశాడు.

పద్మ సున్నా దాటిపోయింది.

ఆ సైకిళ్ళుదూసుకుపోతూ. "మన రంగారావల్లెవున్నాడు కదూ." అనే చప్పుళ్ళు విన్పించాయి.

షేర్ ఖాన్ మరోసారి అవమానం పొందాడు.

పద్మ వెనక్కి తిరిగి షేర్ ఖాన్ ను చూసి తల త్రిప్పుకొనినవ్వుకొన్నట్లు గూడా గుర్తించాడు షేర్ ఖాన్.

ఆ మోటారుసైకిళ్ళ వాళ్ళూ, సైకిలువాడు, ఆ నలుగురూ, పద్మను ఆరాధించే పూజారులు, బాడీగార్డులు.

పద్మ! అందం! ఆమెకు పూజారులుండేటట్లు చేసింది. ఆ పూజారులు ఆమెను ఎప్పుడూ రక్షిస్తూనే ఉంటారు.

ఆ పూజారులున్నంతకాలం తాను పద్మను అవమానపర్చలేడు.

ఇక ఎలా!

ఇప్పుడు సుబ్బారావుకు మొహం ఎలా చూపించేది?

వాడు మర్లా బాస్టర్డ్! అనకుండా ఉంటాడా?...

ఛీ. ఛీ.

ఎంత అవమానం?.

తిరిగి వెనక్కి తిరిగాడు.

అప్పటికి పద్మ ఇరవైయో గజం దాటింది.
రంగారావు ఇంజనీరు ప్రతిభ అడుగంటింది.

# 4

"సక్సెస్సా!" అడిగాడు సుబ్బారావు-గాంధీచౌక్ లో.
తల వంచుకున్నాడు రంగారావు.

"ఇక్కడా ఫెయిలా." అన్నాడు సుబ్బారావు.

తలవంచుకొని "ఎవరో వెధవలు వచ్చారు. దాంతో పథకం దెబ్బతింది." అన్నాడు.

"వాళ్ళు వెధవలు కారు-పద్మ ఆరాధకులు!"అన్నాడు సుబ్బారావు.

రంగారావు మాట్లాడలేదు.

"ఇంక ఇంతేనా నీ గతి." తిరిగి రెచ్చగొట్టాడు సుబ్బారావు.

రంగారావు మాట్లాడలేదు.
"ఇప్పుడేం చేద్దాం!" అడిగాడు సుబ్బారావు.
"ఏముందీ! ఎలాగైనా కని తీర్చుకుంటాను."

"ఎలా?"

"చూస్తూ ఉండు."

"చెప్పు పథక మేదో."

"విను" అంటూ ఇంకో పథకం చెప్పాడు.

* * *

ప్రతి శనివారం వెంకటేశ్వరస్వామి కోవెలకు వెళ్తుంది అందాల రమణి పద్మ. ఎచ్చట పద్మ ఉంటుందోఅక్కడ

భక్తులూ ఉంటారు-పద్మను ఆరాధించేవాళ్ళు అక్కడా ప్రత్యక్షం.

పద్మ దేవుడికి-మంచి మొగుడ్ని యివ్వు స్వామీ! అని నమస్కరిస్తే-ఆ భక్తులు-పద్మను-"నా కోర్కె తీర్చవా దేవీ?" అని ప్రార్థిస్తుంటారు.

ఆ కోవెల అంతా క్రిక్కిరిసిన జనం ఉన్నారు. క్యూ. సాగుతూంది. పద్మ క్యూలో-నుంచున్నది. ఆడక్యూ—మొగక్యూ. రెండూ సాగుతున్నాయి.

పద్మ వెనుక, ఆడవేషంలో రంగారావున్నాడు.

రంగారావు వేసిన పథకం! ఎలాగైనా పద్మను ముద్దు పెట్టుకొని తన కసి, పగ తీర్చుకోవటం, సుబ్బారావు ముందు 'హీరో' అనిపించుకోవటం.

పద్మ తన వెనుక రంగారావు ఆడవేషంలో ఉండటం గమనించింది. నవ్వు వచ్చింది. జాలీ వేసింది. అతని ధైర్యానికి ఆశ్చర్యపోయింది.

రంగారావు విగ్గుతో, మీసాలులేకుండా ఆర్టిఫిషియల్ వక్షోజాలతో, చీరతో, గమ్మత్తుగా ఉన్నాడు. కానీ ఆడ మొగ జాతిలా వున్నాడు. అయినా ఏ జాతికైనా భక్తి వొకటేగదా!

అందుకే అతన్నెవరూ పట్టించుకోలేదు.

పద్మను రాచుకొంటూ నిలబడ్డాడు. అతను సన్నగా వణుకుతున్నాడు. పద్మను వో ఆడది రాసుకున్నట్టుగానే రాసుకోవాలి. లేకపోతే తన సంగతి తెలిస్తే పదిమందీ చితకొట్టేసి, జైలులో తోసేస్తారు. పద్మకు ఇదంతా తమాషాగా వుంది.

'ఏమిటీ! ఇతని ఉద్దేశ్యం! ఏం చేయాలనీ.' అని ఆలోచిస్తున్నది. దేవుడు దగ్గరకు పోతుండగా ఎందుకయినా మంచిదని తన ముందున్న ఆమె ముందుకు వెళ్ళింది. ఆమె పద్మ ప్రక్కింటి ఆమే. కాబట్టీ ఏం అభ్యంతరం చెప్ప లేదు. రంగారావు డైలమాలో పడిపోయాడు.

ఇంత శ్రమా వృథా ఐపోయింది.

అయినా తన పిచ్చిగానీ ఇక్కడ ఇంతమందిలో ఎలా కౌగలించుకొని ముద్దుపెట్టుకోగలడు? ఏదో రాసుకొని నుంచోవటమో, వత్తుకొని నుంచోవటమో చేయచ్చు కానీ...తన తెలివితక్కువ తనానికి మరోసారి చింతించాడు.

అయినా ఇంకేం చేస్తాడు.

పద్మ దర్శన మవగానే బయటకు వచ్చింది.

ఎదురుగ్గా ఆమె భక్తులు ఆమెను చూపులతో ఆహ్వానించారు.

ఆ ఆహ్వానాన్ని లెక్క పెట్టనట్లు ఆమె నడక సాగింది.

ఏమైనా సరే అని రంగారావు వెనక బడ్డాడు.

రంగారావును గుర్తుపట్టారు భక్తులు.

"వోరి! రంగారావు. ఆడవేషం వేశాడ్రోవ్!" అంటూ గోలపెట్టారు.

ఇది ఎక్కడ పద్మ వింటుందో అనేసి గబుక్కున అటుగా వచ్చే రిక్షా ఎక్కేసి ఇంటిముఖం పట్టాడు.

పద్మ ఇంటికి చేరింది సురక్షితంగా.

# 5

"ఫెయిలా!" అన్నాడు సుబ్బారావు రంగారావు మొఖం చూస్తూనే.

విసుగ్గా లాగేసి జాకెట్టు విప్పేసి చీర పరపరా లాగేసి "ఛీ. ఛీ. అంతా ఫెయిలే!" అన్నాడు రంగారావు ఏడుపు మొఖంపెట్టి.

"నీ జాతకం అట్లా ఉంది." అన్నాడు సుబ్బారావు.

"ఏం చేయను సుబ్బారావ్! ప్రతి ప్లానూ అడ్డం తిరుగుతుండే" అన్నాడు విసుగ్గా రంగారావు.

"కర్మ!" అన్నాడు.

"కర్మా! ఇదంతా నీవు చేసింది. ఆరోజు ఆమెచేతిలో దెబ్బలు తిన్నానే అనుకో. కానీ నీవే రెచ్చగొట్టి, నన్ను అవమానం పాలు చేస్తున్నావ్?" అని సుబ్బారావు వైపు తిరిగాడు.

"అంటె! నేను రెచ్చగొట్టుకుంటె - నీవు అంత ఘోర అవమానాన్ని నీలో దాచేసుకునే వాడవంటావ్?" అన్నాడు.

"ఆ!" అన్నాడు రంగారావు.

"షేమ్! షేమ్. మొగజాతికే షేమ్." అంటూ అరిచాడు సుబ్బారావు.

"సుబ్బారావు. నీవు అసలు ఆలోచించటంలేదు. అసలు తప్పు నాదీ. ఆ రోజు ఆ అమ్మాయికి కేవలం నా ప్రేమను వ్యక్తపరుద్దామని వెళ్ళాను. తీరా ఆ అందం. ఆ ముఖం చూసేసరికి నన్ను నేనే మర్చిపోయాను. ఏం చేస్తున్నానో నాకే తెలియలేదు. అందుకే ఆ అమ్మాయి. ఆ

మాత్రం బుద్ధి చెప్పింది. ఇందులో ఆ అమ్మాయి తప్పేం లేదు. అంతా నా తప్పే! నాలాంటి ఆత్రపు రాయళ్ళకు జరగవలసిన శిక్ష అదే!" అన్నాడు.

"నాకు తెలుసు! ఇలా అంటావని నాకు తెలుసు! తప్పు నీమీద వేసుకొంటె ఇంక నిన్నేవరేం చేస్తాదూ." అని సుబ్బారావు మెదలకుండా ఊరుకున్నాడు.

"ఇంక వెధవ ట్రయిల్సన్నీ మానేస్తాను."

"నీ ఇష్టం."

"సాధించవు కదా."

"తప్పంతా నీదే నంటుంటివి కదా! అయినా దెబ్బలు తింది నీవు కాని నేను కాదుకదా!"

"ముందు రెచ్చగొట్టావ్ కదా."

"మొగజాతికి అవమానం సహించలేకపోయాను."

"సరే. ఇంతటితో ఆ చాప్టర్ 'బంద్' చేద్దాం!"

"మరి నీ ప్రేమ."

"నా ప్రేమని ఆమె గుర్తించలేదు కదా."

"నీవు తొందరపడ్డావు కదా."

"అందుకేకదా ఇప్పుడు పశ్చాత్తాపడుతున్నాను."

"పశ్చాత్తాపడితే ఆమె నీ ప్రేమను గుర్తిస్తుందా."

"మరేం చేయాలి నేను."

"అయినా పద్మ చాలా టెంపర్ మనిషి కదూ."

"నిజమే! ఆ టెంపర్ ఉండబట్టి కాలేజీలో నిల్వ గలుగుతూంది."

"అంటే!"

"ఆమెకు ఎంత మంది బాడీగార్డులో తెలుసా!"

"అందరూ ప్రేమించే వారేనా?"

"ఏమో! ఆరాధకులు కావచ్చు."

"ఆరాధన అంటే."

"దేవుడ్ని, దేవతను ఆరాధించినట్లు."

"నీది."

"నాది ప్రేమ."

"మరి అంత ప్రేమించేవాడివి ఎలా కసి, పగ తీర్చుకోవాలని చూశావ్?"

"నీ కోసం!".

"నా కోసమా! నా కోసం...నీ ప్రేమను బలిచేయాలని చూశావా?"

"ఆమె దెబ్బలతోనే నా ప్రేమ బలి ఐపోయింది. ఇక మిగిలింది శూన్యం. కానీ శూన్యంలోకి మంటలు రేపావ్. ఆ మంటలు చల్లార్చుకోవటానికి వేషాలు వేశాను. అవీ ఫలించలేదు."

"ఇంకా నీకు ఆమెమీద ప్రేమ వుందా."

"నేను చచ్చిపోయినా, నేను ఆమెను ప్రేమిస్తాను."

"అంటే, అమరమైన ప్రేమ అన్నమాట."

"నీవేమయినా అనుకో."

"సరే, మీ నాన్న ఉత్తరం వ్రాశాడు."

"ఏమని..."

"చదువు. నే చదవలే."

తండ్రి ఉత్తరం చదివాడు రంగారావు, తను వస్తున్నట్లు. ఏవో పెళ్ళిచూపులు చూడాలన్నట్లు.

"నాన్న వస్తున్నారట! నాకు పెళ్ళిచూపులట."

“అదేదో కథల్లోలాగా, నవల్లోలాగా, పద్మే పెళ్ళి కూతురయితే!” సుబ్బారావు అన్నాడు.

“పద్మ నన్ను పెళ్ళి చేసుకొంటుందా? నా తెలివి తక్కువ పనికి నన్ను క్షమిస్తుందా?”

“నువ్వేం తెలివితక్కువ పని చేశావ్? కాస్త ఉద్రేక పడ్డావ్, అంతే కదా!”

“ఏమో! అయినా పెళ్ళికూతురు పద్మ అని ఎలా నమ్మటం.”

“వస్తున్నాడు కదా మీ నాన్న.”

“అయినా నాకు పెళ్ళేమిటి? భగ్నప్రేమికుడను.”

“ఇక పెళ్ళి చేసుకోవా?”

“చేసుకోను.”

“మరి.”

“బైరాగినవుతా.”

“ఛీ వెధవవవుతావా?”

“ఏం చేయను మరి! నా పద్మ నన్ను నిరాకరించి నప్పుడు.”

“పద్మనే చేసుకొంటావా?”

“అవును.”

“లేకపోతే!”

“చావటమో! సన్యాసి కావటమో జరుగుతూంది.”

“నిజంగా. నువ్వు పద్మను ప్రేమిస్తున్నావ్? మరి నాన్నగారికి ఏం చెప్తావ్?”

“ఇప్పుడు పెళ్ళి వద్దంటాను.”

"తర్వాతయినా చేసుకోమంటాడు కదా."
"తర్వాత సంగతి తర్వాత."

## 6

గుబురు మీసాల నాగభూషణంగారు వచ్చారు. "అబ్బాయ్ రంగా! బయలుదేరు నాయనా" అంటూ రంగారావును బయలుదేర దీశాడు.

రంగారావు లక్షాలొంభై అభ్యంతరాలు చెప్ప బోయాడు. కానీ ఆయనకు రంగారావు పెదాలు కదులుతున్నాయే తప్ప ఆయన చెవులు పనిచెయ్యటం లేదు.
సుబ్బారావు బయలుదేరాడు.

ఆయన రకరకాల గొందులు త్రిప్పి, పండామణయ్యగారి గొందిలోకి తీసుకుపోసాగాడు. రంగారావుకు తన షేర్ ఖాన్ (వేషం) గుర్తుకొచ్చింది. అయినా తండ్రి వెంట గొర్రెపిల్లలా నడిచాడు.

ఆశ్చర్యం!

అదీ కథ...అదీ సినిమా...అదీ నవలలాగా...పెళ్ళికూతురు ఇల్లు పద్మదే.
రంగారావుకు చెమట్లు పోశాయ్.

"నువ్వదృష్టవంతుడివోయ్" అన్నాడు సుబ్బారావు.
'ఏం అదృష్టమో! పద్మచేత మరిన్ని చీవాట్లుకోసమే ఈ పెళ్ళిచూపులు అరేంజ్ చేసినట్లున్నాడు నాన్న' అనుకొన్నాడు రంగారావు.

పెళ్ళిచూపుల తంతు కొనసాగుతూంది.
పెళ్ళికూతురెవరో, ఇంకా సస్పెన్సే.

వచ్చింది కూతురు, పెళ్ళికూతురు.
ఆశ్చర్యం!
పెళ్ళికూతురు పద్మ!

రంగారావుకు ,ముచ్చెమటలు పోశాయి. జేబురుమా లుతో మొఖం, మెడ తుడుచుకుంటున్నాడు.

కాబోయే మామగారు ఫ్యాను స్పీడు ఎక్కువచేశాడు, అల్లుడు బాధ చూళ్ళేక. పద్మను చూశాడు. అప్పుడే పద్మా చూసింది. రెండు చూపులూ కలుసుకున్నాయి. వెంటనే చూపులు తప్పించేశాడు రంగారావు భయంగా. అతని భయం చూసి నవ్వుకొంది పద్మ.

"ఏరా అబ్బాయ్! అమ్మాయి నచ్చినట్లేనా" అని అడుగుతున్నారు నాగభూషణంగారు.
రంగారావుకు ఏమీ విన్పట్టంలేదు.
పద్మ లోపలకు వెళ్ళింది.

ఈ లోకంలోకి వచ్చాడు రంగారావు. "ఏరా చెప్ప వేం?" అడిగాడు మళ్లా నాగభూషణంగారు.

"అమ్మాయికి నేను నచ్చానో, లేదో ముందు కను క్కోండి" అని ఎలాగో గొంతు బ్రద్దలుకొట్టి చెప్పాడు.

లోపలకు కొంతమంది వెళ్ళారు.

సుబ్బారావు మెల్లిగా "ఒప్పుకుంటుందో, లేదో" అన్నాడు.

"ఏమో!" గొంతు బొంగురు చేసుకొన్నాడు రంగా రావు.
"అమ్మాయి ఒప్పుకొంది. మరి మీ ఇష్టం" అంటూ వచ్చారు తిరిగి జనం.

# 7

"అయ్యో చదివింపులు!" అరుస్తున్నాడు పురోహితుడు. రంగారావు స్నేహితులు, పద్మ స్నేహితురాండ్రు, బంధువులు రకరకాలైన ప్రజంటేషన్స్ చదివిస్తున్నారు.

సుబ్బారావు పరిగెత్తుకొంటూ వచ్చి, అపన సభ్యత్వపు కార్డూ, ఆ నెల అపన మంత్లీ, అపన సప్లిమెంటూ రంగారావుకు ప్రజంటేషన్ చేశాడు.

పురోహితుడు ఇలా చదివాడు. "పెళ్ళికుమారుడిగారికి ఆయన స్నేహితుడు సుబ్బారావుగారు, వారి పెళ్ళి సందర్భంగా సమర్పించినది ముచ్చటైన అపన సభ్యత్వపు కార్డూ, అపన మంత్లీ, సప్లిమెంటూ."

రంగారావు, సుబ్బారావువైపు చూశాడు ఆరాధనాపూర్వకంగా.

సుబ్బారావు, పద్మవైపు తిరిగి కొంటెగా నవ్వాడు.

పద్మ సిగ్గు పడింది.

పెళ్ళి జరిగిపోయింది, రంగ రంగ వైభవాలతో.

ఆ రోజు శోభనం.

ఆ రోజు రాత్రి గదిలోకి పోబోయే ముందు రంగారావుకు వో కొత్త నిజం తెల్సింది!

"అయ్యో బావగారూ! మా చెల్లెల్ని ఎలా చూసుకొంటారో" అన్నాడు దీనంగా సుబ్బారావు.

తన్ను తిట్టి, హింసించి, రెచ్చగొట్టిన సుబ్బారావేనా ఇలా మాట్లాడుతుంటే? అనే అనుమానమొచ్చి జుట్టు పీక్కున్నాడు. మంటెత్తింది. తను రంగారావే. మరేమిటిదీ?

"బావేమిటి సుబ్బారావ్. కొత్తగా పిలుస్తున్నావ్. మనం ఫ్రెండ్సుం."

"కాదు బావా! మా పెద్దనాన్నగారి కూతురు పద్మ."

తల తిరిగింది రంగారావుకు.

తలను పట్టుకొన్నాడు సుబ్బారావు తెగి క్రింద పడకుండా, కాసిని మంచి నీళ్ళిచ్చి. "మరి మరి నన్ను రెచ్చగొట్టావ్."

"అదంతా పెద్ద మిస్టరీ కథ బావా!"

"కధా."

"అవును. ఏ ప్రేమకథల వారపత్రికకో పంపాల్సిన కథను, నేను అపనకు పంపేటట్లుగా నీ ప్రేమను మార్చాను."

"అంటే."

"ఏమిటి బావా, నువ్వు మరీ మూడీవి. మా చెల్లి చూడు ఎంత డేరింగ్ డాషింగో."

"అవునవును" బుగ్గలు తడుముకున్నాడు.

"ఇంతకీ మిస్టరీ కథ చెప్పావు కాదు."

"అది మా చెల్లెలు, మీ చెవిలో చెప్తుంది, వినండి" అనేసి నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు సుబ్బారావు.

రంగారావు చెవుల్లో రైళ్ళు పరిగెత్తసాగాయి.

కాళ్ళల్లో వణుకు డీసెల్ ఇంజన్‌తో స్టార్టు అయ్యింది.

గదిలో మంచం. చుట్టూ అగరవత్తుల పరిమళం. వింత వింతగా అలంకరించియున్నది ఆగది.

వంటరిగా, భయంగా - దిగులుగా, కూర్చున్నాడు రంగారావు.

పద్మను గదిలోకి నెట్టి, తలుపు గడివేశారు బయట, అతివలు.

పద్మను చూడగానే రంగారావులో, వో విధమైన జంకు గలిగింది. ఈ పద్మ చేతే తను చెంపదెబ్బలు తిన్నాడు_చెప్పుదెబ్బలు తిన్నాడు. ఆ పద్మ మీద కసి, పగ తీర్చుకోవటానికి షేర్ ఖాన్ వేషం, ఆఖరికి అక్క-నేనిలా ఆడవేషం కూడా వేశాడు. తనే చివరికి మొగుడయ్యాడు. మొగుడయ్యాడని ఆనందంకన్నా, పద్మ ఇంకేం అంటుందో అనే భయమే లోలోపల పీకుతూంది.

పద్మ మెల్లిగా మంచం దగ్గరకు వచ్చింది. రంగారావు మంచం దిగి నుంచున్నాడు, పద్మ రంగారావు పాదాలకు నమస్కరించింది వొంగొని. ఇది ఊహించనైన ఊహించ లేదు రంగారావు.

"పద్మా!" అన్నాడు బొంగురుగా.

"నన్ను క్షమించండీ" అన్నది. పద్మను లేపాడు. అతని హృదయంపై వాలిపోయి "పాపిష్టిదాన్ని,మిమ్మల్ని కొట్టాను. నన్ను క్షమించరూ." అంది కళ్ళవెంబడి నీళ్ళతో.

రంగారావు నీళ్ళుకారిపోయాడు.

"పద్మా! నేనెంత అదృష్టవంతుడ్ని!" అన్నాడు.

"అదృష్టవంతురాల్ని నేను." అన్నది పద్మ.

"ఎలా" అన్నాడు.

"మీలాంటి మంచి భర్త, మీ అంత ప్రేమించే భర్త నాకు దొరకటం నా అదృష్టంకాదా!" అంది.

"నేను మంచివాణ్ణని నీకెలా తెలుసు."

"ఎంత మంచివారు కాకపోతె, నే కొట్టినా నా

ప్రేమకోసం, ఎంతో అవమానాన్నిగూడ సహించి షేర్ ఖాన్, ఆడదాని వేషాలు వేయలా మీరు.''

''నీవు గుర్తు పట్టావా?''

పద్మ పకపకా నవ్వింది.

''డియర్ శ్రీవారూ! ఇది సినిమానా. కథా? వేషం వేసుకున్నంతమాత్రాన గుర్తుపట్టలేక పోవటానికి. ఇది ఇరవైవ శతాబ్దం. మొఖం వొక్కటి మారినంతమాత్రాన మీ నడక, మీ అవయవాలు, మీ చేతులు, మీ కాళ్లు, వేళ్ళు మారతాయా. మీ అణువణువు నాకు గుర్తే.''

''నేను నీకు గుర్తా! నీవు నా వంక సరిగ్గా చూడను గూడ చూడలేదుకదా ఎప్పుడూ.''

''అక్కడే పొరపాటుపడ్డారు శ్రీవారూ! ఆడది గమనించనట్లుండి అంతా గమనిస్తుంది. కాలేజీ మొత్తానికి మీరు నాకు నచ్చారు. మిమ్మల్నే ప్రేమించాను.''

''అయితే, మరి ఆరోజు కొట్టావు. ఎందుకూ'' గారాబంగా అడిగాడు.

''నాకు బాడీగార్డులు చాలామంది ఉన్నారు. ఆ రోజు మీరు నా దగ్గరకు రావటం అందరూ చూశారు.అందరూ చెట్లచాటున దాక్కొన్నారు. నేను మీతో ఏ మాత్రం నా ప్రేమ వ్యక్తంచేసినా-వారు అసూయతో మిమ్మల్నే మయినా చేయవచ్చు. అలుసుగా నన్నూ ఏమన్నా చేయవచ్చు-లేదా కాలేజీ గోడలమీద మీ, నా పేర్లు ఎక్కవచ్చు. అయినా ప్రేమ వ్యక్తం చేయటం అలాగా నమ్మా!'' అంటూ రంగారావు బుగ్గలు సవరించి, ముద్దు పెట్టింది. ఆమె లాలనలో కరిగిపోయి—

''మరి సుబ్బారావు నిన్ను చంపమన్నాడు. నన్ను

రెచ్చగొట్టాడు, తెలుసా.'' అన్నాడు.

''సుబ్బారావన్నయ్యే ఈ పెళ్ళికి కారణం!''

''అంటె!''

''మీ రెంత మంచివారో, మీరు నన్నెంత ప్రేమిస్తున్నారో, అన్నీ నాకు చెప్తుండేవాడు. మీ వేషాల సంగతీ మీ వేషం అయిన తర్వాత చెప్పేవాడు, వాడికి నేను ముందే నీ స్నేహితుడి వేషం తెలుసుకున్నాననే సరికి ఏడ్చేశేవాడు. మా స్నేహితుడ్ని ఏడిపించకే పెళ్ళి చేసుకోవే అని బ్రతిమిలాడేవాడు,'' అంటూ నవ్వింది. ''మా నాన్నచేత మీ నాన్నకు ఉత్తరం వ్రాయించింది కూడా సుబ్బారావన్నయ్యే!'' అంది మళ్ళా.

''పద్మా! నీవు దేవతవు,'' అన్నాడు రంగారావు.

''కాదు మీరు దేవుళ్ళు, నన్ను క్షమించినట్లేనా?''

''క్షమించటమే. శిక్ష తప్పదు దేవికి.'' అంటూ ఆమె క్రింది పెదవి కొరికి అమాంతం పద్మను బెడ్ పైకి తోసి, తనూ మీద పడ్డాడు.

తారకలు మెరిశాయి!

క్రయిమ్ ప్రేమ కథ ముగిసింది.

—: ఐపోయింది :—




(20 వ భాగము)

"ఇవాళ తేదీ ఎంత?"

"ఎలా తెలుస్తుంది మనకు?"

"ఎలాగైనా ప్రయత్నం చేసి తెలుసుకోవాలి! మనం ఆ రోజుకు ఎన్ని రోజులు ముందున్నామో తెలుసుకుంటే, ఈ దీవినుండి తప్పించుకువెళ్లే ప్రయత్నం చెయ్యవచ్చు" అంది డెల్లా కాస్త ధైర్యం తెచ్చుకొని.

ఆమె చెప్పింది బాగానే వుంది. అడవుల్లో, తిరిగి, సముద్రాల్లో చిక్కుబడి వచ్చిన మాకు, తేదీలు, వారాలు, నెలలు తెలియటం ఆగిపోయి ఎన్నో దినాలైంది. ఒక వేళ తెలుసుకొన్నా పెద్ద ప్రయోజనం వుంటుందనిపించలేదు నాకు. కారణం, ఈ దీవి దాటేందుకు చుట్టూ సముద్రాలే వున్నాయి. ఏదయినా చిన్న పడవన్నా సాయం లేకుంటే

ఎలా తప్పించుకోవడం.

పడవ దొరికినా మేం మధ్యసముద్రంలో వుండగానే అలాంటిగాలి వీచిందంటే చేయగలిగిందాట్టే వుండదని పించింది. ఇవన్నీ డెల్లాకు చెప్పడం నా కిష్టం లేక ఊరు కున్నాను.

పై అంతస్తునుండి క్రింది అంతస్తుకు వచ్చాం. అక్కడి గదులన్నీ వెతికాను. ఒక గదిలో గోడకు ఎత్తుగా డిజి టల్ వాల్ క్లాక్ వ్రేలాడుతూంది. అందులో అన్ని వివ రాలు వున్నాయి. ఆ గడియారం ఆడుతుందో లేదో నని చూశాను. దానికి పెండ్యూలం లాటి దేదీలేదు. సోలార్ ఎనర్జీతో నడుస్తున్నట్లుంది. సెకండ్ల ముల్లు తిరగటం కనుపించింది.

ఈరోజు ఆదివారమని తెలుసుకున్నాను. తేదీ ఇరవై నాలుగు. టయమ్ పన్నెండు గంటలా నలభై నిముషా లయింది. అంటే మరో ముప్ఫయి అయిదు గంటలా పది హేను నిముషాల వ్యవధి మాత్రం వుంది మా ప్రాణాలు పోయేందుకు.

గాలిలో ఆక్సిజన్ శాతం తగినంత లేకపోవటంవల్లే మాకు అంతకుముందునుండి సరిగ్గా ఊపిరి ఆడలేదని అర్థం చేసుకున్నాను. రాబోయే విపత్కర వాతావరణకు సూచ నలు అప్పుడే ప్రారంభ మయినాయి. అంటే శాస్త్రజ్ఞులు అంచనా వేసిన ప్రకారం ఆక్సిజన్ లేని విషపుగాలి రావడం నిజమన్న విషయం నా మనస్సుకు తెలిసి పోయింది.

"మన వేం బ్రతుకులు?" అంది డెజ్లా నిరీహతో.

"అంటే...!" అడిగాను.

"అడుగడుగునా ఆపదలే! మీ దేశం చూద్దామని బయలుదేరిన క్షణంనుండీ ఇప్పటిదాకా నిలకడగా ఒక్క చోట వుండగలిగామా? ప్రాణాలకు ముప్పు లేదన్న ధైర్యం ఎప్పుడైనా కలిగిందా? ఇలా అనుక్షణం ఛస్తు బ్రతకడం కన్నా ఒక్కమారుగా చావడం మేలనిపిస్తూంది!" అంది డెల్లా.

"అలా నిరాశపడిపోకు! ప్రతి చీకటి రాత్రీ కొంత వ్యవధి పోయాక వెలుగు వెల్లువను చూస్తూనే వుంటుంది. అలాగే మన స్థితికూడాను" అన్నాను ధైర్యం చెపుతూ.

"ఇంతదాకా మనుష్యులతోనే పోరాడాం! వాళ్ళ యుక్తులు, శక్తులు అవగాహన చేసుకోగలిగాం గాబట్టి ఎదురు ఎత్తులు వేశాం. తప్పించుకున్నాం. ఈ మారు మన పైన పగ చూపింది ప్రకృతి. దాన్ని ఎదుర్కొనే దారి శూన్యం. మనకీ దీవిలో చావు తప్పదు. భగవంతుడు వున్నాడన్న నమ్మకం మనకుంది. ఆయన్ని ప్రార్థించుకోవటం మంచిది" అంది డెల్లా.

విషపుగాలి వీచేందుకు మరో ముప్ఫయ్యారు గంటల వ్యవధి వుంది. ఈలోగా ఈ దీవినుండి దూరంగా వెళ్ళి పోగలిగితే ప్రాణాల్ని కాపాడుకోవచ్చు. అందుకు వేగంగా పోయే విమానం, హెలికాప్టరులాంటి ఆకాశంలో ఎగిరే సాధనాలుగానీ, మోటారుబోటు, షిప్ లాంటి నీళ్ళలో నడిచేవిగానీ, కావాలి. ఎక్కడ దొరుకుతాయి? సముద్రందాటి చేరిన తీరంవేపు వెళ్ళి చూద్దామా అనుకున్నాను. అటువేపు అలాంటివేవీ దొరకవని నమ్మకంగా తెలుసు. రెండోవేపు ప్రయత్నం చెయ్యాలనుకున్నాను.

మా వన్న ఆయుర్దాయం ముప్ఫయి ఆరుగంటలు.

ఈ సమయాన్ని వ్యర్థం చెయ్యదలచుకోలేదు.

ఇప్పుడు ఆకలిలేదు. నీరసంకూడా తగ్గిపోయింది. ఇలాంటి పరిస్థితి ఎదుర్కోవలసి వుంటే ఇద్దరం హాయిగా ఏ చెట్టునీడనో పడివుండేవాళ్ళం కొంతసేపు. విశ్రాంతి కోసం వున్న కొద్ది కాలాన్ని దండగ ఖర్చుపెట్టడం విజ్ఞత కాదనిపించింది.

"డెల్లా!" పిలిచాను.

"ఏమిటి?" అడిగింది.

"నేను ముందు కెళ్ళి తీరందగ్గర మన మీ దీవినుండి తప్పించు కెళ్ళేందుకు ఏదైనా సాధనం దొరుకుతుందేమో చూసిరావాలనుకుంటున్నాను. నువ్వు ఇక్కడే వుండి రెస్ట్ తీసుకుంటావా! లేక నాతో వస్తావా?" అడిగాను.

"ఏదైనా దారి దొరికితే నన్నిక్కడే దిగవిడిచేద్దామను కుంటున్నావా? ఎప్పుడూ వెంటరమ్మని పిలిచేవాడివి! ఇవాళ వస్తావాని అడుగుతున్నావేం?" అడిగింది కోపంగా డెల్లా.

"ఛ! అలా ఎప్పుడూ జరగదు. చచ్చినా, బ్రతికినా జతగానే! నీకు నీరసంగా వుందికదూ! అందుకని అడిగాను" అన్నాను.

"నాకు బాగానే వుంది. వస్తాను" అందామె.

మళ్ళీ రెండు అంతస్తులు వున్న గదికెళ్ళి, కొన్ని బిస్కెట్లు, రెండు విస్కీ సీసాలు తీసుకొచ్చాను.

"వెళ్దామా!" అన్నాను.

"ఊఁ" అంటూ వెంట నడిచింది.

ఇంత పెద్ద రిసర్చి బిల్డింగు కట్టిన ఐక్యరాజ్య సమితి పరిశోధన సంస్థ, ఆక్సిజన్ సిలెండర్లనన్నా తెచ్చి తన సైంటిస్టులకు అవసరమయిన ఘడియల్లో ఎందుకుంచలేదని ఆలోచించసాగాను. అయితే మనిషి అవసరం లేకుండానే అంతకన్నా తెలివిగా, నేర్పుగా, పనిచేసే యంత్ర సాధనాలు శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. వాటిన్ని ఇక్కడ పెట్టి వుండటం గమనించాను. తీరిగ్గా ఎప్పుడైనా వచ్చి అవి నమోదుచేసిన వివరాల్ని వాళ్ళు చూసుకోవచ్చు. అందు వల్లే నిర్జనంగా వుందా దీవి అనుకున్నాను.

ఎక్కడో ఒకచోట ఈ దీవిలో 'హెలిపాడ్' నిర్మించి వుండాలి వాళ్ళు. లేకుంటే ఇంత పెద్ద బిల్డింగు కట్టడం గానీ, అందులో అన్నిరకాల యంత్రాలు, పుస్తకాలు తెచ్చిపెట్టడం అసంభవమనుకున్నాను. ఆ హెలిపాడ్ వద్ద ఏదైనా స్పేర్ హెలికాప్టర్ దొరుకుతుందేమోనన్న ఆశ కలిగింది.

హెలిపాడ్ కోసం వెతుకుతూ తిరుగుతున్నాం నేనూ, డెల్లా. తిరిగి తిరిగి అలసిపోతున్నాం తప్ప, అటువంటి దేమీ మా కంటబడలేదు. ఒకచోట సేద తీర్చుకుందామని కూలబడ్డాం.

దగ్గరున్న సామగ్రిలోంచి బిస్కెట్ పాకెట్ ఓపెన్ చేసి ఒక్కొక్కటి తీసుకొని 'నమలడం మొదలెట్టాం. డెల్లా విస్కీ బాటిల్ కూడా ఓపెన్ చేసింది. మధ్యమధ్య దాంతో గొంతు తడుపుకోసాగాం. కడుపు నిండిందనిపించిందాకా తిన్నాం, ఆ తర్వాత సిగరెట్లు వెలిగించాం. హాయిగా దమ్ములాగుతూ గాల్లోకి వలయాలుగా పొగను

వదలుతూ కూర్చున్నాను నేను. నా కేసి చూస్తూ కూర్చుంది డెల్లా. ఇద్దరం చాలా సేపు మౌనంగానే వుండిపోయాం.

నాకు ప్రస్తుతం మేమున్న ప్రాణాపాయ పరిస్థితినుంచి తప్పించుకోనేందుకు ఎటువంటి మార్గమూ ఎంత ఆలోచించినా, తల బ్రద్దలుకొట్టుకొన్నా తోచడంలేదు. ఏదైనా హెలికాప్టర్ లాటిదన్నా కనుపిస్తే దాని సాయంతో కొన్ని వందల మైళ్ళు పారిపోగలమన్న ధైర్యం కలిగేది. అదీ లేదు.

నేనున్న దీవిపై వీచబోయే విషపుగాలులు మరో ఇరవై నాలుగు గంటల్లో ప్రారంభం కాబోవడం, సరిగ్గా ఆ టయమ్‌కే నేనూ డెల్లా ఇక్కడికి చేరుకోవడంవిచిత్రంగా తోచింది నాకు.

"రాజ్!" పిలిచింది డెల్లా.

తలెత్తి చూశాను, ఆలోచనలనుండి తేరుకుంటూ.

"మనం ఇక్కడనుండి పారిపోయే అవకాశం లేదు. మనకు ప్రమాదం తెచ్చిపెట్టేది ఒక మనిషో, వస్తువో కాదు. ప్రాణాలు పోసేది, పెంచేది, అయిన ప్రకృతి. అది సమస్త జంతుజాలాన్ని మానవలోకాన్ని నాశనం చేసేందుకన్నట్లు ప్రజ్వరిల్లి వస్తుందంటే నా కెందుకో నమ్మబుద్ధి కావడంలేదు. మనం ఖచ్చితంగా తప్పించుకొనే మార్గమొకటి వుండి తీరాలనిపిస్తూంది. కానీ అదేదయిందీ సరిగా తెలిసి చావటంలేదు!" అంది డెల్లా.

"నీ పిచ్చి నీ కిలాంటి ఆలోచనల్ని తెస్తూంది. అంత మంది శాస్త్రజ్ఞులు ఈ దీవిని వదలి వెళ్ళిపోయి ఎక్కడో దూరంనుంచి తమ పరిశోధనలకు అవసరమైన సమాచారాన్ని సమకూర్చుకుంటున్నారంటే, రాబోయే విషపు

గాలులు ఎంత తీవ్రమైనవో నీకు అర్ధం కావడంలేదా?''
అడిగాను నేను.

''మీ దేశంలో చాలామంది యోగాసనాలు వేస్తుంటారు. దాన్ని గురించి తెలుసా?''

''ఇప్పుడు వాటి సంగతి ఎందుకు?'' అడిగాను ఆశ్చర్యంగా.

''అవసరం వుందిగనకే అడిగాను'' అంది డెల్లా.

''కొంత తెలుసు.''

''మీ దేశంలో చాలామంది మామూలు మనుషులు పొట్ట కూటికోసం పబ్లిక్ ప్లేస్‌లో పెద్దగుంటలు త్రవ్వి అందులో తల, మెడ కొంత భాగంవరకు గుండె పెట్టి, ఆ తర్వాత మట్టితో పూడ్పించేసుకొని రోజుల పర్యంతం వుంటారని పత్రికల్లో చదివాను. నిజమేనా?'' అడిగింది డెల్లా.

''నిజమే!'' చెప్పాను.

''నువ్వు చూశావా?''

''చూశాను.''

''అలా చెయ్యగలమా మనం?''

ఆ ప్రశ్నతో ఆమె ఆలోచన అర్ధమయింది నాకు. విషపుగాలులు వీచినా వాటిని మేము పీల్చవలసిన అవసరం లేకుండా ఇరవైనాలుగు గంటలకాలం ప్రాణాయామం చెయ్యమని ఆమె సలహా. చెయ్యగలిగితే ఇది రానున్న ప్రమాదాన్ని తప్పించుకోనేందుకు నిజంగా ఒక మంచి మార్గమే.

''అందుకు చాలా సాధన అవసరం. అందరూ అలా ఊగ్గ బట్టుకొని భూమిలో లభ్యమయ్యే కొద్ది ఆక్సిజన్‌తో ప్రాణాలు నిలబెట్టుకోలేరు డెల్లా!'' చెప్పాను.

"అవసరంకోసం చెయ్యాలి మనం. ఇలాంటప్పుడు సాధనం ప్రసక్తి రాదు. మనం ఊపిరాడక చచ్చినా ఫరవాలేదు. చావు తప్పదని తెలిశాక బ్రతికేందుకో ప్రయత్నం చేశామన్న తృప్తి మనకు మిగులుతుంది గదా ఇలా చేస్తే!"

అవునన్నట్లు తలూపాను.

"అయితే మనంకూడా ప్రయత్నిద్దాం!" అంది డెల్లా.

"సరే!" అన్నాను.

నా ఒప్పుకోలు డెల్లాను ఆనందంలో ముంచింది.

"ఇక మనం తగిన స్థలం చూసుకోవాలి. అక్కడ మనమే రెండుగోతులు త్రవ్వుకోవాలి." అంది డెల్లా.

"అవును!" అన్నాను, ఆ గోతులు, మా గోరీలు కాకుండా వుండేట్లు చూడమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ మనస్సులో.

"ఎలాంటి ప్రదేశమయితే బాగుంటుంది?" అడిగింది డెల్లా.

ఆలోచించసాగాను. సులభంగా త్రవ్వేందుకు వీలుగా వుండాలి. తగినంత గాలి లభ్యం కావాలి. అంటే రేణువుకు రేణువుకు మధ్యదూరం కాస్త ఎక్కువగా వుండాలి. అలాటి ప్రదేశం ఇసుక ఎక్కువగా వున్నచోట్ల తప్ప మరోచోట దొరకదు. సముద్రతీరానికి కాస్త దూరంగా అయితే నేననుకొన్న రకం ప్రదేశం లభ్యమవుతుందని తీర్మానించుకున్నాను.

నా ఆలోచనలు డెల్లాకు చెప్పాను.

ఆమె నా అభిప్రాయాల్తో ఏకీభవించింది.

ఇద్దరం అక్కడ్నించి లేచాం. హెలిపాడ్ వెతికే ప్రయత్నం మానుకున్నాం. సముద్రం వేపుకు నడక ప్రారంభించాం.

కొంతదూరం నడిచేసరికి ఆకాశంలో ఏదో విమానం వస్తున్న చప్పుడయింది. ఇద్దరం తలలెత్తి పైకి చూచాం. దూరంగా చుక్కలా కనిపించింది విమానం. అది బహుశా మేమున్న దీవిలో దిగేందుకే వస్తుందేమోనని అక్కడ నిలబడిపోయాం చూస్తూ.

ఐదు నిముషాల్లో ఆ విమానం మా నడనెత్తికొచ్చింది. ఆ తర్వాత రెండుకందల అడుగుల ఎత్తున మాకు దగ్గరలోనే ప్రదక్షిణాలు చెయ్యసాగింది. దాని శబ్దానికి మా చెవులు చిల్లులు పడిపోతున్నాయి. ఒకటీ రెండూ కాదు, దాదాపు వందసార్లు ప్రదక్షిణం చేసింది. ఎత్తు మారడం లేదు.

ఉన్నట్టుండి విమానం క్రిందిభాగంలో ఒక తలుపు లాంటిదేదో తెరచుకోవడం, దాన్లోంచి పేరాచూట్ వెలుపలికి రావడం గమనించాను నేను. దాని సాయంగా ఎవరైనా మనిషి దిగుతున్నాడేమో ఈ దీవిపైన అనుకున్నాను. డెల్లాకూడా చూసిందా సంఘటన.

"ఎవరో దిగినట్లుంది ఆ విమానంలోంచి!" అన్నాను. విమానంమాత్రం ఆగకుండా, ఇంకా సర్కిల్ చేస్తూనే వుంది. పైకిపోయే ప్రయత్నంలో ఏమాత్రం లేదని అర్ధమయింది నాకు దాని పద్ధతి చూశాక.

"అవును. పేరాచూట్ నేను చూశాను" అంది డెల్లా.

"అతను, ప్రాణాలు నిలబెట్టుకునేందుకు అవసరమైన

"ఆల్ రైట్! దాని సంగతి నేను చూచుకొంటాను."

"ఏం చేస్తావ్?"

"నా ఇష్టం."

"అలాకాదు. నీ పథకం నాకు చెప్పు. పోలీసులకు చిక్కకుండా నీవే ప్రయత్నమయినా చేయ్!"

"డియర్ సుబ్బారావ్! ఇంతకాలం నువ్వు నా మెత్తదనాన్ని చూశావ్. ఇక ముందు ఈ రంగారావు ఎటువంటి వాడో తెలుస్తుంది" అన్నాడు వికటంగా నవ్వుతూ.

సుబ్బారావు బిత్తరపోయాడు. రంగారావు ఎప్పుడూ అట్లా నవ్వలేదు. రంగారావు అంత వికటంగా, అంత క్రోధంగా, అంత కసిగా, ద్వేషంగా నవ్వగలడని సుబ్బారావు ఊహించనైనా ఊహించలేదు.

నవ్వి, నవ్వి, "సుబ్బారావ్! నీ సహాయం నాకు కావాలి."

"నా సహాయమా! అది ఎప్పుడూ నీకు ఉంటూనే వుంటుంది."

"అయితే విను! దాన్ని చంపేస్తాను."

"హత్యా????"

"అవును హత్యే!"

"మరి జైలుకు వెళ్ళాలి కదా!"

"అందుకే నీ సహాయం కావాలి."

"అంటే! నీ బదులు నేను పోనా."

మళ్లా వికటంగా నవ్వేడు రంగారావు.

ఆ నవ్వును చూసి బిత్తరపోయాడు సుబ్బారావు.

"చచ్చు పీనుగా! ఇందాకటినుండి నా క్రిందకి కట్టెలు

ఎగదోసి, తిరిగి చేతులు ముడుచుకు కూర్చుంటే ఎట్లా!" అన్నాడు రంగారావు.

"ఏం చేయమంటావో చెప్పు."

"ఏం చేయక్కర్లేదు. నే చెప్పినట్లు చేయ్" అన్నాడు రంగారావు.

"సరే" అన్నాడు సుబ్బారావు.

రంగారావు, సుబ్బారావుకు ఏదో చెప్పాడు. అంతే! సుబ్బారావు అదిరిపడ్డాడు. రంగారావు ఇంతకాలం సుద్ధ అమాయకుడూ, వెర్రివాడూ అనుకున్నాడు. కానేకాదు జీనియస్!

# 2

పద్మ అందమైన అమ్మాయి. 35, 20, 35 కొలతలు గల శరీరం. రంగు ఎరుపు. పళ్ళు ముత్యాలు. నవ్వితే రత్నాలు. దివినుండి దిగివచ్చిన దేవకన్య.

ఆ అమ్మాయంటే అందరికీ ఇష్టం. కొంతమంది మాట్లాడితే చాలని, కొంతమంది చూస్తే చాలని, కొంతమంది పమిట తగిలితే చాలని, చెయ్యి తగిలితే చాలని, ముట్టుకుంటే చాలని జీవితాలు ధన్యమైపోతాయని, తలస్తుంటారు.

ఆ అమ్మాయి చదివేది కాలేజీలో ముచ్చటగా బి. ఏ. మూడో సంవత్సరం. ఎలక్షన్లు లేకుండానే ఆ అమ్మాయి సెలక్షనయ్యింది కాలేజీ బ్యూటిగా - అఖండమైన వోట్ల మెజారిటీతో.

ఆమె నడిచినచోట ఇసుకను సీసాల్లో భద్రంగా దాచి, పూజచేసే ప్రబుద్ధులున్నారు.

ఆమె కూర్చున్న బెంచీమీద ముద్దులు పెట్టుకొనే పూజారులున్నారు.

ఆమె బట్టలువేసే చాకలివాడి దగ్గరకు పోయి, ఆమె బట్టలను అద్దెకు తెచ్చుకొని, ఓ రాత్రి ఆ బట్టలనే కాగలించుకొని తిరిగి మర్నాటికి చాకలికి అందజేసే రోమియోలున్నారు.

ఆమె నవ్వితే ముత్యాలు ఏరుకునే మిథ్యాయానులున్నారు.

ఆమె ఎటు నడిస్తే అటు పోయే ప్యారసైటులున్నారు.

ఆమె క్వీన్!

ఆ క్వీన్ కోసం పడిగాపులు కాసేవారు వేలమంది.

కానీ పాపం! ఆ అమ్మాయికి చదువిష్టం. మొగాడు స్త్రీకి ఎందుకు పనికివస్తాడో తెలియనంత అమాయకంగా ఉంటుంది.

చాలామంది ఆడవాళ్ళు తెలిసినా, తెలియనట్లు నటిస్తారు. కానీ ఈ అమ్మాయికి తెలియకే, తెలియనట్లుంటుందేమో నన్నట్లుంది.

ఆ పద్మ!

చేత అవమానించబడ్డాడు రంగారావు.

అదీ సుబ్బారావు చూస్తుండగా.

రంగారావు బావుంటాడు. అమితాబ్ లా లేకపోయినా, శత్రుఘ్నసిన్హా కాకపోయినా, శశికపూర్ లా ఉంటాడు.

అతన్ని హీరో అన్నారు కొంతకాలం. కానీ తర్వాత తెలుగు సినిమాల్లోలాగా చాలామంది బట్టలు కట్టించుకొని హీరోలయ్యారు. దాంతో రంగారావు పని గోవిందా అయింది.

కానీ రంగారావుకు కావలసింది హీరో వర్షిప్ కాదు. పద్మ సాహచర్యం!

పద్మను హీరోయిన్ని చేసి లక్షాతొంభై కలలు కన్నాడు.

రకరకాలైన డ్రీమ్స్ పొందాడు.

అన్నిట్లో దేవత పద్మ!

కానీ దేవుడు తను కాలేకపోయాడు రంగారావు.

కారణం నిద్రపోతున్నాడు కాబట్టి!

కానీ ఘోరమైన అవమానం జరిగింది రంగారావుకు.

అదే...

*   *   *

పద్మను చాలాకాలంగా ఎరుగును రంగారావు. అంటే, కాలేజీలోనే. మాటలతో కాదు. చూపులతోనే. అదీ వాన్ వే ట్రాఫిక్కే.

పద్మ! తలంచుకుని పోతూంది. తలొంచుని వస్తూంది. తన దారిపొడుగునా లక్షాలొంభై కళ్ళతోరణాలు ఉంటా యని ఆ పిల్లకు తెలియదో? తెలుసో?

ఆ రోజు!

"పద్మగారూ!" పిలిచాడు రంగారావు.

ఏమన్నట్లు చూసింది పద్మ.

దూరంగా ఎవ్వరూ లేరు. కానీ చెట్టుచాటున సుబ్బా రావును చూడలేదు రంగారావు.

"నేను...మిమ్మల్ని."

"ఆ..."

"ప్రేమిస్తున్నాను" అన్నాడు.

"ప్రేమా!" అంది, అదేమిటో తెలియనట్లు.

చుట్టూ చూశాడు, ఎవ్వరూ లేరు. ఆరోజు పద్మ లైబ్రరీలో ఉండిపోయింది. ఆరయింది. కాలేజీ అంతా నిర్మానుష్యం!

ప్రేమ అంటే ఏమిటో చూపిద్దామని, దగ్గరకి జరిగి, పద్మను కౌగలించుకుని గట్టిగా ముద్దు పెట్టుకోబోయాడు.

ఆ పిల్ల సింహప్పిల్లయ్యింది.

గబుక్కున రంగారావును విడిపించుకుని, అతని చెంప మీద చట్ చట్ మని కొట్టసాగింది. ఆ పిల్ల అపర కాళిలాగున్నది. ఇంకా కసి తీరక, కాలి హైహీ షూ తీసుకుని నెత్తిమీద, చెంపలమీదా వాయించసాగింది.

రంగారావు నిరుత్తురుడయ్యాడు. చేష్టలుడిగిపోయాయి. దిమ్మ తిరిగిపోయాడు. ప్రపంచం తిరిగిపోసాగింది.

అంతలో జరిగింది మరో అవమానం!

చుట్టుప్రక్కల చెట్లనుండి వరుసగా రాసాగారు. రంగారావులు...వాళ్ళతోబాటు సుబ్బారావు వచ్చాడు.

అంతమంది అక్కడుండేసరికి రంగారావు తల తీసేసినంత పనయ్యింది. అలాగే అక్కడే కూలబడి సీతమ్మవారిలాగా భూమిలోకి కూరుకుపోతే బావుండు ననుకున్నాడు. కానీ అతడు పవిత్రుడు కాదు కదా.

పద్మ ఆయాసంతో రొప్పుతూ చెప్పేసుకొని, వడి వడిగా ఇంటికేసి నడవసాగింది.

రోజూ ఆమెను ఇంటిదగ్గర సురక్షితంగా దింపే బాడీగార్డులు ఆమె వెంట నడిచారు.

మరికొందరు రంగారావు పరిస్థితి చూసి జాలి చెందారు.

మరికొందరు ప్రేమను తమ లిస్టులోంచి కొట్టేశారు.

కొందరు ఏడ్చారు, కొందరు నవ్వారు.

కానీ సుబ్బారావు రెచ్చగొట్టాడు అతడిని "బాస్టర్డ్" అంటూ!

# 3

రంగారావు చెప్పిన పథకమేమంటే! పద్మ వంటరిగా ఏ సందులోనో, గొందులోనో కన్పడితే తీసుకెళ్ళి, పద్మను

గట్టిగా కౌగలించుకొని, ముద్దుపెట్టేసుకొని పరిగెత్తు కొచ్చెయ్యటం!

దీనివలన అతని కసి, పగ తీరుతుందట.

అయితే! ఈ పని ఇలా రంగారావులా చేయడట. వేషం మార్చుకుంటాడట - తెలుగు సినిమాల్లో చీటికీ మాటికీ వేషాలుమార్చే హీరోలా.

ఆ వేషంతో పద్మను ముద్దు పెట్టుకుంటాడట.

పెట్టుకొని పరిగెత్తుకొని వచ్చేస్తాట్ట.

పద్మకు చస్తే తెలియదట తను రంగారావని. ఇదీ సుబ్బారావుకు రంగారావు చెప్పిన అద్వితీయమైన ప్లాను.

సుబ్బారావు "యస్!" అన్నాడు.

దానికి తగ్గట్టు ఆ రోజునుండీ రంగారావు రకరకాలుగా క్రాపులు దువ్వుకోవటం, మీసం పెంచటం (వొరిజినాలిటీ కోసం) ఇంకా కొన్ని దుస్తులు సంపాదించటం (అద్దెకు కాదు—కారణం? వొకవేళ పట్టుబడితే ఆ దుస్తుల అద్దె కొట్టువాడు పోలీసులకు సాక్ష్యం ఇస్తాడు కదా) మొదలగు భారీ కార్యక్రమాల్లో మునిగిపోయాడు.

సుబ్బారావు తను అన్నట్లుగానే సహాయ సహకారాలు అందజేయసాగాడు.

రంగారావు తయారయ్యాడు కొత్త వేషంలో. అతన్నిప్పుడు ఎవ్వరూ గుర్తించలేరు రంగారావని.

పద్మ వంటరిగా వచ్చే మార్గాలు రంగారావుకే కాదు, ఆమెను ఆరాధించే వారందరికీ తెలుసు.

పద్మ కాలేజీ రోడ్డుమీదగా వచ్చి, గాంధీచౌక్ సెంటరుగుండా, పండామణయ్యగారి వీధిలో గుండా తమ ఇంటికి పోతుంది. పండామణయ్యగారి వీధిలో జనం

ఉండరు. అదో సన్నటి వీధి. ఆ వీధి పొడవు 20 గజా లుంటుంది. ఆ 20 గజాల వీధి గుండా పుస్తకాలు 35 సైజుకు అనించుకొని, 35 సైజును హంసలా ఊగిస్తూ, 25 ను వంకరలు తిరిగేటట్టు నడుస్తూంది అందాల వయ్యారి పద్మ.

ఆ రోజు అమావాస్య! అదే మంచిరోజుగా భావిం చాడు రంగారావు. సుబ్బారావుకు చెప్పాడు, రంగంలోకి దూకుతున్నానని. సుబ్బారావు ఆశీర్వదించాడు.

ఆ రోజు పద్మ పండామణయ్యగారి వీధిగుండా వస్తు న్నది. వీధిలో జనంలేరు. ఆ వీధిలో మొదటి గజంలో అడుగుపెట్టింది. 20 వ గజంలో అడుగు తీసేలోపల తన పని కానిచ్చుకొని పారిపోవాలనుకొన్నాడు. అంతకు తప్ప గత్యంతరం లేదు.

కారణం ఆ వీధి దగ్గరకు వచ్చేదాకా కూడా పద్మ ఒంటరిగా ఉండదు. స్నేహితురాండ్రు ఉంటూనే ఉంటారు. వాళ్ళు అక్కడ విడిపోతారు ఎవరింటికివారు. పద్మ వొక్కతే ఆ ఇరవై గజాలూ హంసలా నడుస్తూ ఆ వీధి దాటంగానే మరో గజానికి ఆమె ఇల్లు. రంగా రావుది ఎంత సాహసమైన గుండె అంటె ఆమె ఇంటికి 21 గజాల లోపలే ఆమెను—ముద్దు పెట్టుకోవటానికి సాహసించిన వీరుడు.

పద్మ ఆరోజూ స్నేహితులందర్నీ వదలి-ఆ వీధిలో మొదటి గజం దాటింది. మెరుపులా ముందుకు దూకాడు. పద్మవెంటే నడవసాగాడు. వెనకా ముందూ చూసుకొం టున్నాడు. 10వ గజంలో తన పని పూర్తి కానిద్దామను కొన్నాడు. ఎంచేతంటే మొదటి 6 గజాలూ-చివరి 6

గజాలూ అటూ ఇటూ పోయే వీధుల్లో మనుష్యుల దృష్టి లోకి వస్తాయి. అదే 10 వ గజంలో అయితే—ఎవరో ప్రేమికులు... భ్రాంతిలో పడవచ్చు.

పద్మ నడవసాగింది.

రంగారావు. కాదు షేర్ ఖాన్ వేషంలో వున్నాడు రంగారావు.

షేర్ ఖాన్ నడుస్తున్నాడు.

పద్మా నడుస్తున్నది.

పద్మ నడుస్తూ వెనక షేర్ ఖాన్‌ను గమనించింది' వెంటనే నవ్వుకొంది. ఎందుకంటే ఆ వీధి సినిమా కాదు' అతను నటుడూ కాదు. ఆమె నటీ కాదు. షేర్ ఖాన్‌ను రంగారావుగా గుర్తించింది పద్మ.

నవ్వుకొని 'దెబ్బలు చాల్లేదేమో!' అనుకొంది.

షేర్ ఖాన్ ధైర్యంగా నడుస్తున్నాడు. పదోగజం కోసం చూస్తున్నాడు. క్రితం రోజు వచ్చి టేపుతో వోచచ్చు ఇంజనీరులా ఏవేవో కొలతలు కొలుచుకొని—ముదు పెట్టుకోవలసిన స్పాటు గుర్తులను కొని—అక్కడ బొగ్గుతో 'సున్నా' చుట్టుకొని వెళ్ళిపోయాడు. ఆ పదో గజంలో— ఆ సున్నాలోకి ఎప్పుడు ఆమె ఎంటర్ అవుతుందో అప్పుడే తన పని కానిచ్చి—మిగతా తొమ్మిది గజాలూ రన్నింగ్ చేసి పారిపోవాలి.

పద్మ సున్నాను సమీపిస్తూంది.

షేర్ ఖాన్ సున్నానే చూస్తున్నాడు.

పద్మ సున్నాలో అడుగుపెట్టింది.

షేర్ ఖాన్ గబుక్కున ముందుకురికి పద్మను పట్టుకో బోయాడు.

ఇంతలో దెయ్యాల్లా...

గవర్న మెంటు ఫైరింజనుల్లా.

ఆపద భాంధవుల్లా.

రెండు మోటారు సైకిల్లూ, ఒక సైకిలు, నలుగురు మనుష్యులూ, ఆ స్పాట్ కు వచ్చేశారు.

మోటారుసైకిళ్ళ చప్పుళ్ళకు,

ఆ గోలకూ,

షేర్ ఖాన్ వెనక్కు చూశాడు.

పద్మ సున్నా దాటిపోయింది.

ఆ సైకిళ్ళుదూసుకపోతూ. "మన రంగారావల్లేవున్నాడు కదూ." అనే చప్పుళ్ళు విన్పించాయి.

షేర్ ఖాన్ మరోసారి అవమానం పొందాడు.

పద్మ వెనక్కి తిరిగి షేర్ ఖాన్ ను చూసి తల త్రిప్పుకొనినవ్వుకొన్నట్లు గూడా గుర్తించాడు షేర్ ఖాన్.

ఆ మోటారుసైకిళ్ళ వాళ్ళూ, సైకిలువాడు, ఆ నలుగురూ, పద్మను ఆరాధించే పూజారులు, బాడీగార్డులు.

పద్మ! అందం! ఆమెకు పూజారులుండేటట్లు చేసింది. ఆ పూజారులు ఆమెను ఎప్పుడూ రక్షిస్తూనే ఉంటారు.

ఆ పూజారులున్నంతకాలం తాను పద్మను అవమానపర్చలేడు.

ఇక ఎలా!

ఇప్పుడు సుబ్బారావుకు మొహం ఎలా చూపించేది?

వాడు మర్లా బాస్టర్డ్! అనకుండా ఉంటాడా?...

ఛీ. ఛీ.

ఎంత అవమానం?.

తిరిగి వెనక్కి తిరిగాడు.

అప్పటికి పద్మ ఇరవైయో గజం దాటింది.
రంగారావు ఇంజనీరు ప్రతిభ అడుగంటింది.

## 4

"సక్సెస్సా!" అడిగాడు సుబ్బారావు-గాంధీచౌక్‌లో.

తల వంచుకున్నాడు రంగారావు.

"ఇక్కడా ఫెయిలా." అన్నాడు సుబ్బారావు.

తలవంచుకొని "ఎవరో వెధవలు వచ్చారు. దాంతో పథకం దెబ్బతింది." అన్నాడు.

"వాళ్ళు వెధవలు కారు-పద్మ ఆరాధకులు!"అన్నాడు సుబ్బారావు.

రంగారావు మాట్లాడలేదు.

"ఇంక ఇంతేనా నీ గతి." తిరిగి రెచ్చగొట్టాడు సుబ్బారావు.

రంగారావు మాట్లాడలేదు.

"ఇప్పుడేం చేద్దాం!" అడిగాడు సుబ్బారావు.

"ఏముందీ! ఎలాగైనా కసి తీర్చుకుంటాను."

"ఎలా?"

"చూస్తూ ఉండు."

"చెప్పు పథక మేదో."

"విను" అంటూ ఇంకో పథకం చెప్పాడు.

* * *

ప్రతి శనివారం వెంకటేశ్వరస్వామి కోవెలకు వెళ్తుంది అందాల రమణి పద్మ. ఎచ్చట పద్మ ఉంటుందోఅక్కడ

భక్తులూ ఉంటారు-పద్మను ఆరాధించేవాళ్ళు అక్కడా ప్రత్యక్షం.

పద్మ దేవుడికి-మంచి మొగుణ్ని యివ్వు స్వామీ! అని నమస్కరిస్తే-ఆ భక్తులు-పద్మను-"నా కోర్కె తీర్చవా దేవీ!" అని ప్రార్థిస్తుంటారు.

ఆ కోవెల అంతా క్రిక్కిరిసిన జనం ఉన్నారు. క్యూ. సాగుతూంది. పద్మ క్యూలో-నుంచున్నది. ఆడక్యూ—మొగక్యూ. రెండూ సాగుతున్నాయి.

పద్మ వెనుక, ఆడవేషంలో రంగారావున్నాడు.

రంగారావు వేసిన పథకం! ఎలాగైనా పద్మను ముద్దు పెట్టుకొని తన కసి, పగ తీర్చుకోవటం, సుబ్బారావు ముందు 'హీరో' అనిపించుకోవటం.

పద్మ తన వెనుక రంగారావు ఆడవేషంలో ఉండటం గమనించింది. నవ్వు వచ్చింది. జాలీ వేసింది. అతని ధైర్యానికి ఆశ్చర్యపోయింది.

రంగారావు విగ్గుతో, మీసాలులేకుండా ఆర్టిఫిషియల్ వక్షోజాలలో, చీరతో, గమ్మత్తుగా ఉన్నాడు. కానీ ఆడ మొగ జాతిలా వున్నాడు. అయినా ఏ జాతికైనా భక్తి వొకటేగదా!

అందుకే అతన్నెవరూ పట్టించుకోలేదు.

పద్మను రాచుకొంటూ నిలబడ్డాడు. అతను సన్నగా వణుకుతున్నాడు. పద్మను వో ఆడది రాసుకున్నట్టుగానే రాసుకోవాలి. లేకపోతే తన సంగతి తెలిస్తే పదిమందీ చితక్కొట్టేసి, జైలులో తోసేస్తారు. పద్మకు ఇదంతా తమాషాగా వుంది.

'ఏమిటీ! ఇతని ఉద్దేశ్యం! ఏం చేయాలనీ.' అని ఆలోచిస్తున్నది. దేవుడు దగ్గరకు పోతుండగా ఎందుకయినా మంచిదని తన ముందున్న ఆమె ముందుకు వెళ్ళింది. ఆమె పద్మ ప్రక్కింటి ఆమే. కాబట్టి ఏం అభ్యంతరం చెప్పలేదు. రంగారావు డైలమాలో పడిపోయాడు.

ఇంత శ్రమా వృథా ఐపోయింది.

అయినా తన పిచ్చిగానీ ఇక్కడ ఇంతమందిలో ఎలా కౌగలించుకొని ముద్దుపెట్టుకోగలడు? ఏదో రాసుకొని నుంచోవటమో, వత్తుకొని నుంచోవటమో చేయచ్చు కానీ...తన తెలివితక్కువ తనానికి మరోసారి చింతించాడు.

అయినా ఇంకేం చేస్తాడు.

పద్మ దర్శన మవగానే బయటకు వచ్చింది.

ఎదురుగ్గా ఆమె భక్తులు ఆమెను చూపులతో ఆహ్వానించారు.

ఆ ఆహ్వానాన్ని లెక్క పెట్టనట్లు ఆమె నడక సాగింది.

ఏమైనా సరే అని రంగారావు వెనక బడ్డాడు.

రంగారావును గుర్తుపట్టారు భక్తులు.

"వోరె! రంగారావు. ఆడవేషం వేశాడ్రోవ్!" అంటూ గోలపెట్టారు.

ఇది ఎక్కడ పద్మ వింటుందో అనేసి గబుక్కున అటుగా వచ్చే రిక్షా ఎక్కేసి ఇంటిముఖం పట్టాడు.

పద్మ ఇంటికి చేరింది సురక్షితంగా.

# 5

"ఫెయిలా!" అన్నాడు సుబ్బారావు రంగారావు మొఖం చూస్తూనే.

విగ్గులాగేసి జాకెట్టు విప్పేసి చీర పరపరా లాగేసి "ఛీ. ఛీ. అంతా ఫెయిలే!" అన్నాడు రంగారావు ఏడుపు మొఖంపెట్టి.

"నీ జాతకం అట్లా ఉంది." అన్నాడు సుబ్బారావు.

"ఏం చేయను సుబ్బారావ్! ప్రతి ప్లానూ అడ్డం తిరుగుతుండె" అన్నాడు విసుగ్గా రంగారావు.

"కర్మ!" అన్నాడు.

"కర్మా! ఇదంతా నీవు చేసింది. ఆరోజు ఆమెచేతిలో దెబ్బలు తిన్నానే అనుకో. కానీ నీవే రెచ్చగొట్టి, నన్ను అవమానం పాలు చేస్తున్నావ్?" అని సుబ్బారావు వైపు తిరిగాడు.

"అంటే! నేను రెచ్చగొట్టుకుంటె - నీవు అంత ఘోర అవమానాన్ని నీలో దాచేసుకునే వాడవంటావ్?" అన్నాడు.

"ఆ!" అన్నాడు రంగారావు.

"షేమ్! షేమ్. మొగజాతికే షేమ్." అంటూ అరిచాడు సుబ్బారావు.

"సుబ్బారావు. నీవు అసలు ఆలోచించటంలేదు. అసలు తప్పు నాదీ. ఆ రోజు ఆ అమ్మాయికి కేవలం నా ప్రేమను వ్యక్తపరుద్దామని వెళ్ళాను. తీరా ఆ అందం. ఆ ముఖం చూసేసరికి నన్ను నేనే మర్చిపోయాను. ఏం చేస్తున్నానో నాకే తెలియలేదు. అందుకే ఆ అమ్మాయి. ఆ

మాత్రం బుద్ధి చెప్పింది. ఇందులో ఆ అమ్మాయి తప్పేం లేదు. అంతా నా తప్పే! నాలాంటి ఆత్రపు రాయళ్ళకు జరగవలసిన శిక్ష అదే!" అన్నాడు.

"నాకు తెలుసు! ఇలా అంటావని నాకు తెలుసు! తప్పు నీమీద వేసుకొంటె ఇంక నిన్నెవరేం చేస్తారూ." అని సుబ్బారావు మెదలకుండా ఊరుకున్నాడు.

"ఇంక వెధవ ట్రయిల్సన్నీ మానేస్తాను."

"నీ ఇష్టం."

"సాధించవు కదా."

"తప్పంతా నీదే నంటుంటివి కదా! అయినా దెబ్బలు తింది నీవు కాని నేను కాదుకదా!"

"ముందు రెచ్చగొట్టావ్ కదా."

"మొగజాతికి అవమానం సహించలేకపోయాను."

"సరే. ఇంతటితో ఆ చాప్టర్ 'బంద్' చేద్దాం!"

"మరి నీ ప్రేమ."

"నా ప్రేమని ఆమె గుర్తించలేదు కదా."

"నీవు తొందరపడ్డావు కదా."

"అందుకేకదా ఇప్పుడు పశ్చాత్తాపడుతున్నాను."

"పశ్చాత్తాపడితే ఆమె నీ ప్రేమను గుర్తిస్తుందా."

"మరేం చేయాలి నేను."

"అయినా పద్మ చాలా టెంపర్ మనిషి కదూ."

"నిజమే! ఆ టెంపర్ ఉండబట్టి కాలేజీలో నిల్వ గలుగుతూంది."

"అంటే!"

"ఆమెకు ఎంత మంది బాడీగార్డులో తెలుసా!"

"అందరూ ప్రేమించే వారేనా?"

"ఏమో! ఆరాధకులు కావచ్చు."

"ఆరాధన అంటె."

"దేవుడ్ని, దేవతను ఆరాధించినట్లు."

"నీది."

"నాది ప్రేమ."

"మరి అంత ప్రేమించేవాడివి ఎలా కసి, పగ తీర్చు కోవాలని చూశావ్?"

"నీ కోసం!"

"నా కోసమా! నా కోసం...నీ ప్రేమను బలిచేయాలని చూశావా?"

"ఆమె దెబ్బలతోనే నా ప్రేమ బలి ఐపోయింది. ఇక మిగిలింది శూన్యం. కానీ శూన్యంలోకి మంటలు రేపావ్. ఆ మంటలు చల్లార్చుకోవటానికి వేషాలు వేశాను. అవీ ఫలించలేదు."

"ఇంకా నీకు ఆమెమీద ప్రేమ వుందా."

"నేను చచ్చిపోయినా, నేను ఆమెను ప్రేమిస్తాను."

"అంటే, అమరమైన ప్రేమ అన్నమాట."

"నీ వేమయినా అనుకో."

"సరే, మీ నాన్న ఉత్తరం వ్రాశాడు."

"ఏమని..."

"చదువు. నే చదవలే."

తండ్రి ఉత్తరం చదివాడు రంగారావు, తను వస్తున్నట్లు. ఏవో పెళ్ళిచూపులు చూడాలన్నట్లు.

"నాన్న వస్తున్నారట! నాకు పెళ్ళిచూపులట."

"అదేదో కథల్లోలాగా, నవల్లోలాగా, పద్మే పెళ్ళి కూతురయితే!" సుబ్బారావు అన్నాడు.

"పద్మ నన్ను పెళ్ళి చేసుకొంటుందా? నా తెలివి తక్కువ పనికి నన్ను క్షమిస్తుందా?"

"నువ్వేం తెలివితక్కువ పని చేశావ్? కాస్త ఉద్రేక పడ్డావ్, అంతే కదా!"

"ఏమో! అయినా పెళ్ళికూతురు పద్మ అని ఎలా నమ్మటం."

"వస్తున్నాడు కదా మీ నాన్న."

"అయినా నాకు పెళ్ళేమిటి? భగ్నప్రేమికుడను."

"ఇక పెళ్ళి చేసుకోవా?"

"చేసుకోను."

"మరి."

"బైరాగినవుతా."

"ఛీ వెధవవవుతావా?"

"ఏం చేయను మరి! నా పద్మ నన్ను నిరాకరించి నప్పుడు."

"పద్మనే చేసుకొంటావా?"

"అవును."

"లేకపోతే!"

"చావటమో! సన్యాసి కావటమో జరుగుతూంది."

"నిజంగా. నువ్వు పద్మను ప్రేమిస్తున్నావ్? మరి నాన్నగారికి ఏం చెప్తావ్?"

"ఇప్పుడు పెళ్ళి వద్దంటాను."

అన్ని ఏర్పాట్లు చేసుకొనే వచ్చివుంటాడు. వెళ్ళి అతన్ని పట్టుకుందాం. మనల్నికూడా అతనే బ్రతికిస్తాడు" అన్నాను.

"ఒకవేళ అతను, తనవరకే ఏర్పాట్లు చేసుకుని వచ్చి వుంటే ఏం చేద్దాం?" అడిగింది డెల్లా.

"వాడొక్కడు. మనం ఇద్దరం. వాణ్ణి చంపనా్నా మనం బ్రతికే దారి చూసుకుందాం!" అన్నాను.

"గుడ్!" అంది డెల్లా.

ఇద్దరం ఆ విమానం తిరుగుతున్న వేపుకు వడివడిగా అడుగులు వేశాం. అరగంటకన్నా తక్కువ వ్యవధిలోనే ఆ ప్రాంతం చేరుకున్నాం. చిన్నచిన్న దిబ్బలు, రాతి గుట్టలు, ముళ్ళకంపలు వున్నాయి ఆ ప్రదేశంలో. పేరా చూట్ కోసం వెతుక్కుంటూ తిరిగాం. మరో అరగంట తర్వాతగాని దాని జాడ తెలుసుకోలేకపోయాం. మా హడావుడిలో విమానం శబ్దం ఎప్పుడు ఆగిపోయిందికూడా గుర్తు పెట్టుకోలేదు. శబ్దంమాత్రం వినరావడంలేదు. వచ్చిన పని పూర్తయింది గాబట్టి విమానం వెనక్కి వెళ్ళిపోయి వుంటుందని అనుకున్నాను నేను.

ఒక చిన్న రాతిగుట్టను ఆనుకుని పడుంది పేరా చూట్. వెళ్ళి దాన్ని ప్రక్కకు లాగాం. అడుగుభాగాన పెట్టెలాంటి చిన్న యంత్రమేదో వుంది. దాన్ని తేరిపార చూశాను. దానిపైన యు. ఎస్. ఏ. సైంటిస్టులు వాడే మోనోగ్రామ్ తప్ప మరేవిధమైన వివరాలు లేవు. ఇది కూడా వాళ్ళ పరిశోధనల కుపయోగించే యంత్రమయి వుండాలనుకున్నాను.

కొండను కష్టపడి త్రవ్వి ఎలుకను పట్టినట్లయింది మా శ్రమంతా. ఎంతో ఆశగా పరుగెత్తుకొచ్చాం. అది కాస్తా నిరాశని తేలాక, మళ్ళా మొదటిచోటే ఉండిపోయామని తెలుసుకున్నాం.

"ఆ విమానం ఏమయింది?" అడిగింది డెల్లా.

"ఏమో? నేను గమనించలేదు!" అన్నాను.

"ఇక్కడెక్కడో దిగివుంటుంది. చూద్దాం పదండి" అంటూ దారితీసింది ముందుకు.

నేనూ ఆమెను అనుసరించాను. వందగజాలు నడిచాం. విమానం కనుపించింది. ఆనందంతో ఎగిరి గంతులేయవలసిన మాకు వెచ్చగా దూరంనుండే సెగ తగిలింది. ఎర్రగా, చింతనిప్పు కణికలా కాలిపోయివున్న విమానం భగభగ మండుతూ కనుపించింది.

"ఇది పైలట్ లెస్ విమానం. దూరం, వేగం, అన్నీ సెట్ చేసి పంపివుంటారు. సరిగ్గా ఈ దీవికే రావటానికి వీలుగా, ఏదో దూరంగావున్న ఎయిరోడ్రామ్‌నుంచి సెట్ లైట్ ద్వారా, ఈ విమానం యొక్క డైరక్షను, అల్టిట్యూడ్, స్పీడ్, కంట్రోలు చేసివుంటారు. దాని పని అది నిర్వహించగానే క్రిందికి కూలిపోయింది. అలా వేగంగా కూలిపోవడంలో గాస్ టాంక్ బద్దలై మంటల్లో చిక్కుకుని వుంటుంది" అన్నాను.

చైతన్యరహితంగా, కత్తిగాటుకు నెత్తురుచుక్క రానట్లు, మొహం పెట్టుకుని ఆ మంటలకేసి చూస్తూ నిలుచుంది డెల్లా. ఆమెలో రేగిన ఆశలుకూడా బహుశా ఆ మంటల్లోనే తగలబడిపోయా యనుకుందేమోనని తలచి

బాధపడడం తప్ప నేను చేయగలిగిందికూడా ఏమీలేదు.

నా వేపుకు తిరిగింది డెల్లా.

ఆమె కళ్ళలోకి సూటిగా చూశాను. అవి అంతదాకా కారిన నీళ్ళతో తడిసి కాస్త ఎర్రబడ్డాయి.

"రాజ్! చూశావా? ఏమైందో?"

"దాన్ని గురించి బాధపడకు. ఇవి మనకు మామూలే!" అంటూ ఆ విమానం ఎందుకొచ్చిందీ, ఎవరు పంపిందీ, ఎలా కాలిపోయిందీ నాకు తెలిసినంతవరకూ వివరంగా చెప్పాను. డెల్లా ఓపికగా వినింది.

"మనం ముందనుకున్న విధంగా సముద్రప్రాంతానికి వెళ్దామా?" అడిగింది చివరకు.

"అంతకన్నా మరో మార్గం లేనట్లుంది" అన్నాను.

ఇద్దరం అక్కడ్నుంచి వెనక్కు బయలుదేరాం.

అంతకుముందు మేము ఆలోచించిన పథకం గురించి నా మెదడు తర్కవితర్కాలు చెయ్యడం మొదలెట్టింది. గోతులు త్రవ్వుకుని తలలు అందులో పెట్టుకున్నాక ఎదురయ్యే సమస్య లన్నింటినీ లెఖవేశాను.

శాస్త్రజ్ఞుల అంచనాప్రకారం విషవుగాలులు దాదాపు ఇరవై నాలుగు గంటలసేపు వీస్తాయి యీ దీవిపైన. అంతసేపు మేము దమ్ముపట్టి తలలు నేలలోపెట్టి, అక్కడ చిక్కే కొద్దిపాటి ఆక్సిజన్‌తో ప్రాణాలు పోకుండా కాపాడుకోగలమా అన్నది అనుమానాస్పదమైనవిషయం. ఆతర్వాత, ఇరవై నాలుగు గంటలయిందీ, కానిదీ మాకు తెనిపే వారుకానీ, తెలిసేదారికానీ లేదు. అంచనాలు తప్పయి ముందే వెలుపలికి తలలు తీశామంటే ప్రక్కన

ప్రాణాలు పోతాయి.

ఆ పైన, మేము ఎన్నుకోదలచుకున్న ప్రదేశం సముద్ర తీరం, ఇసుక ప్రాంతం మేము తలలు లోపల పెట్టాక, ఏదైనా ఇసుక తుఫాను లాంటిది వచ్చిందంటే మమ్మల్ని తప్పివేస్తూ ఇసుక మేట వేసుకుపోయే ప్రమాదముంది. అలా జరిగిన పక్షంలో ఇక వెలుపలికి రావడమనేది లేదు. ఆ అపాయం నుండి తప్పించుకొనే మార్గం కూడా ముందే వెతుక్కోవాలి.

భూమిలో తలపెట్టాక, పూడ్చుకునేప్పుడు ఇసుక చెవులు, ముక్కూ, కళ్ళు, నోరు తోడ భాగాల్లోకిపోవచ్చు అలా పోయిందంటే ఊపిరాడదు. అలా పోకుండా చూసుకోవలసిన అవసరంకూడా వుంది.

ఈ సమస్యలన్నీ సక్రమంగా, మాకు తృప్తికరంగా పరిష్కారం చేసుకోగలిగినప్పుడే, మా పథకం ఫలించి మా ప్రాణాలు పోకుండా నిలబడతాయన్నది నిర్వివాదాంశం.

అరగంటపైనే నడిచాం విమానం కాలిపోయినప్రాంతా న్నుండి సముద్రం వేపుకు. ఒకచోట ఆగి చుట్టూ చూసు కున్నాం.

"ఇక్కడ బాగుందికదూ!" అడిగింది డెల్లా.

"ఆఁ!" అంటూ తలూపాను.

"గోతులు త్రవ్వుకుందామా?" అంది ఆమె మళ్ళీ.

గోతులు అన్నమాట గోరీలుగా వినిపించింది నాకు.

"ఆఁ! కానీ దేంతో త్రవ్వుకుందాం. చేతుల్తో త్రవ్వటం కష్టం. ఏదైనా పారలాంటిదుంటే బావుంటుంది"

అన్నాను.

"ఆ బిల్డింగులోకి వెళ్ళి చూద్దాం. ఏదైనా దొరుకుతుం దేమో?" అన్నాను.

ఆమె కూడా తలూపింది.

ఇద్దరం బిల్డింగుకు బయలుదేరాం.

"అక్కడ మరికొన్ని పరికరాలు కూడా చూచుకోవాలి మనం!" అన్నాను దగ్గరికంటూ వచ్చాక.

పరికరాలు ఏమిటా అన్నట్లు చూసింది.

"మన కళ్లూ, ముక్కూ, చెవులూ, నోరూ ఇసుకతో నిండిపోకుండా అడ్డుగా వుండేందుకు పనికొచ్చే గ్లాస్ కాటన్ కావాలి. టైమ్ ఇరవై నాలుగు గంటలు అయినట్లు తెలిసేందుకు అలారం కొట్టే చిన్న టైంపీస్ లాంటిదేదన్నా చూసుకొని దాన్ని కూడా మనతోనే పాతిపెట్టుకోవాలి!" అన్నాను.

"గుడ్! నీ బ్రెయిన్ అద్భుతంగా పనిచేస్తుంది!" అంది డెల్లా.

"అన్నింటినీ మించి మరో పెద్ద ప్రమాదం సంభవించే అవకాశముంది. దాన్నుంచికూడా బైటపడే మార్గం ఆలోచించాలి" అన్నాను.

"ఏమిటది?"

ఇసుక తుఫానులు రావటం, వాటివల్ల మాకు జరగబోయే అపకారం వివరంగా చెప్పాను. విని వెర్రిముఖం

పెట్టి తలవాల్చేసింది డెల్లా.

"అలాంటిది జరిగితే మనల్ని ఎవరు రక్షిస్తారు?" అడిగింది డెల్లా భయంగా.

"అదే ఆలోచిస్తున్నాను ఇందాకట్నుంచి" అన్నాను.

అంతలోనే బిల్డింగు దగ్గర కొచ్చేశాం ఇద్దరం. తలుపులు తెరచుకొని లోనికి ప్రవేశించాం. క్రింది భాగం మొత్తం గాలించాం. మట్టిత్రవ్వే లారీలకొత్తే షవల్ కనుపించింది. దాన్ని తీసుకున్నాం. ఆ తర్వాత మూడు అంతస్తులోకి జొరబడ్డాం. అక్కడ అల్మైరాలన్నీ తెరచి చక్కబెట్టాం. గ్లాస్ కాటన్ కనుపించింది. రెండు రోల్స్ తీసుకొని పాంటు జేబుల్లో కుక్కుకున్నాను.

అక్కడే ట్రాన్సిస్టరుతో పనిచేసే చిన్న అలారం టైంపీస్ దొరికింది. దాన్ని కూడా తీసి జేబులో వేసుకున్నాను. దాంతో నేను ఎదురుచూసిన నాలుగింటిలోని మూడు సమస్యలకు పరిష్కార మార్గం దొరికింది. నాలుగోది మాత్రం అపరిష్కృతంగా మిగిలిపోయింది.

అక్కడే కూర్చొని ఆలోచించసాగాను.

ఉన్నట్టుండి మెరుపులా మెరిసింది నాకో ఆలోచన. విషవుగాలులు వీచిన కొంతసేపటికల్లా ఈ రిసెర్చి సెంటరుకు శాస్త్రజ్ఞులు, వాళ్ళ అసిస్టెంట్లు మొదలైనవాళ్ళంతా చేరుకుంటారు, తమ ప్రయోగాల ఫలితాల్ని తెలుసుకునేందుకు. వాళ్ళకు తమ పరిస్థితి వివరిస్తూ ఉత్తరం రాసిపెట్టి, కాపాడమని అర్థిస్తే, ఆ ఉత్తరం చదివి వాళ్లొచ్చి తమను

రక్షించే అవకాశంముంది, అంతకన్నా మరో మంచి దారి లేదనిపించింది.

ఒక కాగితం, పెన్నూ తీసుకొని, మేము ఎంచుకొన్న ప్రదేశం, బిల్డింగుకి ఏ కోణంలో, ఎంత దూరంలో వున్నదీ, తెలిపే బొమ్మగీచాను. ఆ ప్రదేశంవద్ద రెండు గుండు సున్నలు చుట్టి అందులో ఇంటూలుపెట్టి మార్క్ చేశాను కాగితం వెనుక వేపున, మా వివరాలు, మేమెలా ఈ దీవి కొచ్చిందీ, విషపు గాలుల్నించి తప్పించుకోవటానికి, ఎటువంటి ప్రయత్నం చేస్తున్నదీ మొదలైనదంతా వివరంగా రాశాను.

మేము ఎదురుచూస్తున్న ఇసక తుఫానుల ప్రమాదం గురించి కూడా తెలియపరచాను. దీవి చేరంగానే మమ్మల్ని వెలికితీసే ప్రయత్నం ముందుగా చెయ్యమన్న నా అభ్యర్థనను అందులో ఎరుకపరచాను. మా ప్రాణాలు పోవడం జరిగితే శవాల్ని ఏ దేశాలకు పంపవలసిందీ, అడ్రసులతో సహా తెలియపర్చాను.

రాయడం ముగించాక కాగితాన్ని డెల్లాకు అందజేశాను చదవమని. ఆమె తదేకంగా చదివింది. తిరిగి కాగితాన్ని నా కందిచ్చింది.

"నేను రాసింది చాలుగా?" అడిగాను.

"చాలు!" అంది డెల్లా.

ఆ కాగితాన్ని తీసుకెళ్ళి మూడో అంతస్తులో వున్న పెద్ద మిషను ప్రక్కనున్న పేపర్ రెస్టర్‌లో అమర్చాను.

అక్కడైతే అది వాళ్ళ దృష్టిని సులభంగా ఆకర్షిస్తుందన్న ఉద్దేశ్యంతో.

బిల్డింగులోంచి మేము సేకరించుకున్న సామగ్రి తీసుకొని బైట పడ్డాం. మళ్ళీ అంతకు ముందుకు గుర్తు పెట్టుకొన్న సముద్రతీర ప్రదేశం వేపు నడక సాగించాం.

గాలిలో ఆక్సిజన్ పాలు తక్కువవుతున్నట్లు తోచింది నాకు. ఎంత గాలి పీల్చినా ఊపిరి అందడం లేదు, తేమ కూడా అంతకుముందుకన్నా కాస్త ఎక్కువ పాళ్ళలో వున్నట్లు తోచింది.

మేము గుర్తు పెట్టుకున్న స్పాట్ చేరుకున్నాం. షెవల్ తీసుకొని త్రవ్వడం మొదలెట్టాను. డెల్లా చేతులతో ఇసుకను గొయ్యి అంచులపైకి లాగడం ప్రారంభం చేసింది. పధ్నాలుగు అంగుళాలలోతు గొయ్యి తీశాను. షవల్ ప్రక్కనే పెట్టాను.

"ఆగావేం? మరో గొయ్యి తియ్యొద్దూ?" అడిగింది డెల్లా.

"కాదు! ఓమారు ట్రయల్ చూస్తాను. ఆ తర్వాత రెండోది త్రవ్వుదాం!" అన్నాను నేను.

"సరే!" అంది.

నేను గాజుగుడ్డ మొఖానికి చెవులకు కప్పడిపోయేట్లుగా కట్టుకున్నాను. తలగొయ్యిలో పెట్టాను. చేతులు రెండూ గొయ్యి అంచులపైన ఉండేట్లుగా అమర్చ

కున్నాను. ఇసుకలోనికి తోయమని సైగ చేశాను డెల్లాకు.

"నువ్వే తోసుకో! ఆ తర్వాత ఎటు' ఎవరి గొయ్యి వారు పూడ్చుకోవల్సిందేగా?" అంది.

ఆమె మాటలుకూడా సబబుగానే కనుపించాయి. నేనే చేతుల్తో అంచులపైనున్న ఇసుకను త్రోసుకో సాగాను. రెండు నిముషాల్లో మెడదాకా ఇసుకపడింది.

నాకేవిధమైన శబ్దం వినిపించడం లేదు. గాలి చాలా కొద్దిగా వస్తూంది. కానీ వెలుపలి గాలిలోకన్నా ఇసుక రేణువుల మధ్యనుంచి వస్తున్న గాలిలో ఆక్సిజన్ ఎక్కువ పాళ్ళల్లో వున్నట్లు అర్థమయింది. కళ్ళు మూతబడి వున్నాయి. అందువల్ల విపరీతంగా చీకటి పేరుకుని పోయింది. ఊపిరితిత్తులపైన ఒత్తిడి ఎక్కువయింది. గాలి పీల్చేందుకు వాటంగా పెద్దవి చెయ్యవలసి వస్తుంది. అలా ఇరవై నాలుగు గంటలు వుండటం సులభంకాదని మాత్రం అర్థమయింది నాకు ఆ రెండు నిముషాల అనుభవంలోనే. అంతలోనే ఇండియాలో, కొంతమంది రోజులు కాదు, దాదాపు వారాలు, కొన్ని సందర్భాల్లో నెలలు అలా నేలలో ఎలా వుండగలుగుతున్నారో అర్థంకాక కాసేపు ఆలోచించసాగాను.

వెలుపలికి తల తీసేద్దామనుకున్నాను. నా తలచుట్టూ వున్న ఇసుకను లాగెయ్యమన్నట్లు, గుర్తుగా కాళ్ళాడించాను డెల్లా తెలుసుకోవటం కోసం.

రెండునిముషాల్లో డెల్లా ఇసుకంతా తీసేసింది, తల బైటికి పెట్టాను. మొఖానికి కట్టుకున్న గుడ్డ విప్పాను. అరచేతుల్తో కళ్ళను ఘట్టిగా అద్దుకొని మెల్లమెల్లగా తెరుస్తూ కొద్దికొద్దిగా వెలుతురును చూడసాగాను. పూర్తిగా కళ్ళు తెరవడానికి దాదాపు ఒక నిముషం పట్టింది.

"ఎలా వుంది?" అడిగింది డెల్లా.

"ఏమిటీ?" అడిగాను నవ్వుతూ.

"మీ అనుభవం?"

"బాగానే వుంది" అన్నాను.

"అంటే ఎలా అర్థమవుతుంది. కాస్త వివరంగా చెప్పు!" అంది డెల్లా.

"అంత భయంకరంగా లేదు. ఊపిరాడుతూనే వుంది. ఊపిరితిత్తుల్ని మాత్రం ఎక్కువ అలసట పెట్టకుండా దమ్ము పెట్టి గాలి పీల్చాలి. అలాగే మెల్లగా వదలాలి. అలా చేస్తే మనం ప్రాణాలతో తిరిగి బైటపడే అవకాశం వుంటుందనుకుంటాను" అన్నాను.

"నాకో అనుమానం వచ్చింది" అంది పక్కన డెల్లా.

"ఏమిటది?"

"మనం తలలు భూమిలో పెట్టుకుని పడున్నా, అక్కడ వచ్చే గాలిలో మాత్రం విషపుఛాయ లుండ వన్న గ్యారంటీ ఏమైనా వుందా? లేదా? అలా లేనప్పుడు మన ప్రయత్నం మొత్తం వృధాయేకదా?" నిస్పృహతో చూసింది నన్ను.

ఒక్కక్షణం నాకూ అర్థంకాలేదు ఆ సమస్యకు సమాధానం.

ఆలోచించసాగాను. సముద్రంలో బ్రతికే చేపలు భూమిలో పెరిగే ఎర్రలు మొదలైనవాటికి ప్రాణవాయువు అక్కడికక్కడే దొరుకుతుండటం తెలుసుకున్నాను చదువుకొనే రోజుల్లో. అలాగే భూమిలోపలి పొరల్లో వుండే గాలికీ, వెలుపలిగాలికీ బహుశా సంబంధం వుండక పోవచ్చు ననిపించింది. ఆ అభిప్రాయమే డెల్లాకు తెలియ పరచాను.

"అలా అయితే బ్రతుకుతాం! లేకుంటే ఇంత ప్రయత్నం చేసీ నిష్ప్రయోజన మవుతుంది!" అంది డెల్లా.

"అలా ఎందుకనుకోవాలి! ప్రయత్నం చెయ్యడం మన బాధ్యత. ఫలితాలు దైవాధీనాలు" అన్నాను.

పవల్ తీసుకొని ముందు త్రవ్విన గొయ్యి ప్రక్కనే మరో గొయ్యి త్రవ్వసాగాను. డెల్లా చేతుల్తో మట్టి తీసి అంచులపైన సర్దసాగింది. అదీ పద్నాలుగంగుళాల లోతు కాగానే ఆపి, పవల్ ప్రక్కన పడేశాను.

"గడియారం నా దగ్గర పెట్టుకొంటాను" అన్నాను.

"అలాగే!" అంది డెల్లా.

"మన చేతులు ఒకదానికొకటి తగిలేట్లుగా అరేంజ్ చేసుకుందాం. కనీసం చచ్చేప్పుడూ కలసి చచ్చినట్లన్నా వుంటుంది. అలా చావకుంటే ఎవరు బ్రతికివుండీ, ఎవరు చచ్చిందీ స్పర్శను బట్టన్నా తెలుసుకోవచ్చు" అన్నాను.

"గుడ్ ఐడియా!" అంది డెల్లా,

"పవల్‌ను కూడా మనకు దగ్గరగా నిలువున పాతి పెడతాను. మనకోసం వెతుకుతూ వచ్చే వాళ్ళకది ఆచూకీఅన్నా ఇస్తుంది!" అన్నాను.

"ఈ ఐడియా నిజంగా చాలా బాగుంది!" అంది డెల్లా.

"మనం ఎన్ని గంటలకు గోతుల్లోకి దిగుదాం" అని అడిగింది తిరిగి.

"ఈ విషపు గాలులు వీస్తున్నట్లు అనుమానం రాగానే తలలు గోతుల్లో పెట్టేద్దాం! శాస్త్రజ్ఞుల లెక్క ప్రకారం ఇంకా ఎనిమిదిగంటలా ఇరవై ఆరు నిముషాల వ్యవధి వుంది ఆ గాలులు ప్రారంభం కావడానికి" అన్నాను.

నాకు క్షణక్షణానికి అనుమానం ఎక్కువకావడం మొదలైంది. ఊపిరి ఆడటం కాస్త కష్టమవుతున్నట్లు తోచసాగింది. అదంతా విషపుగాలుల ప్రభావమేమో ననిపించసాగింది. డెల్లా మాత్రం మాటా పలుకూ లేకుండా ఎటో చూస్తూ, ఏదో ఆలోచిస్తూ, ఇసుకలో వ్రేళ్ళతో గీస్తూ కూచుంది.

"డెల్లా!" పిలిచాను మెల్లిగా.

ఏమిటన్నట్లు తలెత్తి చూసింది నాకేసి.

"ఎలా వుంది?" అడిగాను.

"ఏది?"

"గాలి!"

"అంటే..." అర్థం గానట్లు చూస్తూ అడిగింది.

"విషం కలసినట్లు అనుమానంగా ఏమన్నా వుందా నీకు?" అడిగాను నా అనుమానం నివృత్తి చేసుకోనేందుకు.

"ఇంకా చాలా వ్యవధి వుందని నువ్వే చెప్పావుగా? అయినా నాకేం అలాంటి అనుమానం కలగడం లేదు. మనం దీవిపైన కాలు పెట్టినప్పుడు ఎలా వుందో ఇప్పుడూ అలాగే వున్నట్లనిపిస్తుంది" అంది డెల్లా.

(సశేషం)

## సప్లిమెంట్ పోటీ - 16.

95, 96, 97, 98, 99 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు మార్చి '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టు కార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి. మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ క త్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి. — ఎడిటర్

## జోకర్ పేజీ వినోదం

# 74

"ఏమండోయ్, ఈమధ్య మీరు మీ యింట్లో గండుపిల్లిని పెంచుతున్నట్టున్నారే........" అడిగింది మీనాక్షి, పక్కింటి కామాక్షిని.

"అబ్బే, అదేంలేదే మా యింట్లో."

"అరె, రాత్రుళ్ళు మీ యింట్లో నుండి క్యార్, క్యార్ మని గండుపిల్లి అరుపులు వినిపిస్తాయే మరి" సంశయంగా చూస్తూ అడిగింది మళ్ళీ కామాక్షిని.

"ఓ, అదా....ఈ మధ్య మా యింట్లో ఎలుకల బెడద ఎక్కువైందండీ. రాత్రుళ్ళు అవి అల్లరి చెయ్యకుండా వుండేందుకు మా శ్రీవారు అప్పుడప్పుడు అలా అరుస్తుంటారు" తాపీగా చెప్పింది కామాక్షి.

* * *

రెస్టారెంట్ బార్ ముందునుండి ఓ యువతి నాజూగ్గా నడుచుకుంటూ వెళుతున్నది.

అంతలోనే రెస్టారెంట్ బార్‌లో నుండి తప్పతాగిన ఓ వ్యక్తి బైటకొచ్చాడు.

అతని చూపు సేరుగా వెళ్ళి, వ్యానిటీబ్యాగ్ వూపుకుంటూ వెళుతున్న ఆ యువతిపై పడింది. అంతే, అప్పటివరకూ అతనిలోవున్న నిషా రెట్టింపయ్యింది. ఇక ఆగలేనన్నట్టుగా ఒక్క వుదుటున ఆ యువతి ముందుకెళ్ళి, అతి కష్టంపైన హీరో ఫోజులో నిల్చున్నాడు.

"త్రాగితే మరిచిపోగలను....'' అంటూ మొదలెట్టాడు.

వెంటనే ఆ యువతి "చెప్పుతీస్తే పారిపోగలవు" తీక్షణంగా చూస్తూ అంది.

అంతే, ఆ దేవదాసు తోక ముడిచేసుకుని తిరిగిచూడకుండా పరిగెత్తాడు.

* * *

"ఒరే, బాబ్జీ నీకు మీ అమ్మంటే ఇష్టమా, లేక మీ నాన్నంటే ఇష్టమా?" అడిగాడు మేష్టారు ఒకరోజు ఐదేళ్ళ బాబ్జీని,

"ఎవరూ ఇష్టంలేదు నాకు" ముఖం ముడుచుకుంటూ చెప్పాడు బాబ్జీ.

"ఎందుకిష్టంలేదురా?" మాష్టారు గొంతులో ప్రశ్నార్థకం ధ్వనించింది.

"మరే....ఎప్పుడు చూసినా వాళ్ళే ముద్దులు పెట్టుకుంటుంటారు.

—ఎమ్. వీరాస్వామి, మల్కాజిగిరి.

## 75

ఆరేళ్ళ బాబు నిద్రపోతున్నాడు. తల్లి, తాను సినిమాలో చూసిన పాట పాడుతోంది గట్టిగా.

"ష్....ముద్దుల మా బాబు నిద్దరోతున్నాడు,

సద్దుచేశారంటే పులికులికి పడతాడు........"

ఇంతలో బాబు చటుక్కున లేచి కూర్చుని "అమ్మా! నన్ను హాయిగా నిద్రపోనియ్యవే" అన్నాడు తల్లితో.

ప్రఖ్యాత డిటెక్టివ్ 'పిచ్చేశ్ ఖన్నా' ముందు కూర్చుండొక క్రొత్త వ్యక్తి.

"ఏమండీ! పిచ్చేశ్‌గారు! మావూర్లో హత్యజరిగింది పరిశోధించాలండీ" అర్థించాడా వ్యక్తి దీనంగా.

"మీ దేవూరు?"

"రుద్రంపూర్."

"ఐ. సీ. మొన్ననేగా నా అసిస్టెంటును పంపాను పరిశోధించమని?"

"ఇవ్వాళ ప్రొద్దున తేలింది ఆయన శవమేనండీ బాబు."

* * *

ఇండియాలో ఒకేరోజు పదిమంది రాజకీయ నాయకులు చనిపోయారు. యమభటులు వారిని నరకలోకం తీసుకవెళ్ళారు.

యముడు: చిత్రగుప్తా వీళ్ళ పాపపు ఫైళ్ళిలా పట్రా.

చిత్రగుప్తుడు ఒక వంద పుస్తకాల కట్టలు పెట్టాడు.

"ఇదేమిటోయ్! పదిమందేగా వందపుస్తకాలు తెచ్చావ్!"

"సారీ సర్! వందపుస్తకాలు ఇందులో ఒక్కరివే వీరివి లోపల వున్నాయి. తీయాలి," అంటూ సంజాయిషీ యిచ్చాడు చిత్రగుప్తుడు.

—బి. సరాశ్రీ, రుద్రంపూర్

